# రాధబాబు

[కథల సంపుటి]

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు బి. ఎ., యల్. టి.,



పబ్లిషర్సు :

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

# రాధబాబు

మీసాల చివరలు కొనపంట్లతో నొక్కిపట్టి, సిరాలో ముంచిన కలం చేత్తోపట్టుకొని, పక్కనున్న కిటికీలోనుంచి యథాలాపంగా చూస్తూ కూర్చున్నాను. ఇంతలో దభేలు మని శబ్దం అయింది. గుండె గుభేలుమంది. భయం నా ముఖాన్ని అంతా కప్పివేసింది. కళ్ళు తేలిపోయినవి. అంత భయం నాకు ఎందుకు కలిగిందో నేను చెప్పలేను.

నాకు ఎదురుగానే మా పెద్దబ్బాయి, శాస్త్రి కూర్చుని చదువుకొంటున్నాడు. వాడూ తెల్లపోయి చూచి "ఎవరో చేద బావిలో పడేసి వుంటారు" అన్నాడు.

ఎందుచేతనో ఆ మాట నాకు నిజమని తోచలేదు. తోచినట్లయితే నేను కుర్చీలోనుంచి ఎగిరిపడి లేవకపొయ్యేవాణ్ణే. లేచి ఒక్కగంతులో డొడ్లో బావిదగ్గరకు పరుగెత్తాను. శాస్త్రి నా వెనకాలే పరుగెత్తుకొని వస్తూ, "ఇంకెవరున్నారూ ఆ దయ్యం, పాపే పడేసి వుంటుంది" అన్నాడు.

"వద్దేఅమ్మా, నీవు బావిదగ్గరకు పోబోకే" అని నెత్తిన నోరుపెట్టుకొని అరచినా అది వినక వీలైనప్పుడల్లా అది బావిదగ్గరకు పరుగెత్తుకెళ్ళి, ఎవ్వరూ లేకుండాచూచి బావిలో చేదవేస్తుంది. దాన్నిపైకిలాగలేక వదిలేసి వూరు

కొంటుంది. ఇల్లా అనేకసార్లు జరిగింది. అందుకనే నాను అల్లాగ అన్నాడు.

బావిదగ్గర పాపా లేదు. ఎవ్వరూ లేరు. తెల్లపోయి చూస్తూనేవున్నాము. ఇంతలోకే వీధిలోనుంచి పాప, వంట యింట్లోనుంచి మా ఆవిడా పరుగెత్తుకొచ్చారు, "ఏమిటి, ఏమిటి?" అంటూ, ఎటొచ్చి మాచినఅబ్బాయి రాధబాబు కనుపించలేదు.

నేను బావిలోకి తొంగిచూద్దునుగదా ఆ చిన్నకుంక రాధబాబు నీళ్ళలో ఉక్కిరిబిక్కిరై తేలుతున్నాడు. "ఓరి బాబూ, ఓరి నాయినా అంటూ కేక వేశాము అంతాసూ."

ఒడ్డున కేకవేస్తూ అంతా ఎగురుతున్నామేగాని చటుక్కున లోపలికి దిగి వాణ్ణి పైకిలాగాలని తోచలేదు. ఒక తాడు లోపలిక వెయ్యాలని తోచలేదు. ఏమీతోచలేదు. "చూస్తారేం, దిగండి" అని కేక వేసింది తల్లి. అప్పటికి నేను తెప్పరిల్లి వరలమీద కాలుపెట్టి దిగబోయాను. ఇంతలో రాధబాబు తేలి వరలు పట్టుకొని పైకి వస్తున్నాడు.

చిన్నసన్యాసి బిక్కముఖంతో గజగజ వణికి పోతున్నాడు. "గట్టిగా పట్టుకో" "ఈ వరమీద కాలుపెట్టు" "జాగ్రత్త. జారుతుంది" అంటూ కేకలు పెట్టాము. నానాఅవస్థాపడి ఎట్లాగెతేనేం వాడు పైకి వచ్చాడు.

తల్లి వాణ్ణి గబుక్కున దగ్గరకు లాక్కుని "ఏమిట్రా నాయనా, ఎందుకు దిగావురా బావిలోకి!" అంటూ తల తుడుస్తున్నది తన పమిటి చెంగుతో.

నాకు గుండెదడ తగ్గలేదు ఇంకా. "అసలు బావిలోకి ఎందుకు దిగాడో కనుక్కో?" అన్నాను పళ్ళు బిగపట్టి.

"కనుక్కుందాం లెండి. వణికిపోతున్నాడు. ఇంతవరకు మనం అదృష్టవంతులము. పండగ పూట కూడాను! చూశావా ఎంతగండం తప్పిందో!" అంటూ ఆవిడ కొడుకును గట్టిగా కౌగలించుకొంది. వీడు అప్పుడే తల్లిని గట్టిగా కావిలించుకొన్నాడు.

వీడు బావిలో ఎల్లాగ పడివుంటాడూ అన్న సందేహం మాలో ఎవ్వరికీ లేదు. వాడికి బావిలో దిగటం అంటే సరదా. దానికోసం వాడు చిన్న నాటకము ఆడుతాడు. సీటపైన తేలేవస్తువ ఏదైనా ఒకటి ముందు బావిలోకి గిరాటేస్తాడు. ఏదో డబ్బా, పుల్లా అట్లాంటిది. అది చెయి జారి బావిలో పడ్డదన్నమాట. దాన్ని బొక్కెనతో తీయటానికి కాసేపు ప్రయత్నంచేస్తాడు. అది రాదు. ఆపైన ఇహ బావిలోకి దిగడం అవసరము అవుతుంది. అప్పుడు వాడు దిగి ఒక పుల్లతో దాన్ని దగ్గరకు లాక్కొని, చేత్తో అందుకొని, ఆపళంగా పైకి వస్తాడు. ఈ మధ్య పాప అరుస్తునే ఉంటుంది. "దిగొద్దురా జారుతావేమోరా?" అని. వద్దు అంటూ వున్నపనిని నిర్భయముగా చేయడములో శౌర్య

సాహసాలు ప్రకటన అనృతయ్యాని వాడికి తెలుసు. దాని తరువాత చీవాట్లు తగిలినాసరే. ఇల్లాగ ఒకసారిగాదు. అయిదారుసార్లు జరిగింది. ప్రతిసారీ చీవాట్లు వేస్తూనే వున్నాము. అల్లాంటి పనిచేయకురా, జారిపడ్డావా ప్రమాదంరా అంటూ. ఈసారి కాలుజారి పడివుంటాడు. భగవంతుడి దయవల్ల ప్రమాదము లేకుండా బైటపడ్డాడు.

"ఈ గండము గడిచింది. కాని వాడికి గట్టిగా బుద్ధి చెప్పకపోతే యింకా ఎందుకన్నా పనికివస్తాడా? బావిలోకి దిగాలిసినపని ఏమివచ్చిందో కనుక్కో వాడిని."అని నేను గట్టిగా, కోపముగా అంటూ వాణ్ని కొట్టబోయాను.

"విచారు కొంచెము వుండండి. అసలు సంగతి కనుక్కో నీయండి" అంటూ ఆవిడ నాకు అడ్డమువచ్చి, "ఎందుకు దిగావురా? దేనికోసము దిగావురా నాయనా బావిలోకి, చిచ్చిబాబూ" అంటూ ఆవిడ ఆనందబాష్పాలు కార్చింది. వాడు మాట్లాడకుండా తల్లికి అతుక్కుపోయాడు.

ఇటువంటి విషయాల్లో పాప సాయములేనిదే సాధారణముగా వాడు ఏపనీ చెయ్యడు. అది బావిలో ఏదో పడేసి వీడిని దిగమని ప్రోత్సహిస్తుంది.

"ఈ అల్లరిలో నీవు వున్నావే పాపా? బావిలో ఏం పడేశావు! దయ్యమా చెప్పు?"అని కేకలేశాను. "నేనేమీ యెరగను నాన్నా అసలు నేను ఇక్కడ లేను, అక్కడున్నాను దభీమని ప్రమోతవినిని పరుగెత్తుకొచ్చాను. నే నేమెరుగుదు

నేం ? అంతా నామీద పెడతారు.'' అంటూ బిక్కముఖం పెట్టింది. బావిలోకి తొంగిచూస్తే, కేలంగా వున్న వస్తువ ఏదీ అక్కడ కనుపించలేదు.

వాళ్ళమ్మ యింకా వాడికి వళ్ళు తుడుస్తునేవుంది. ''నా తండ్రి. నాతండ్రి యెంతగండం తప్పిందిరా ? పండగపూట కూడాను ! ఎంత అదృష్టవంతులమురా ఇవ్వాళ'' అంటూ.

ఇంతకూ వాడు బావిలోకి ఎందుకు దిగాలిసొచ్చిందో తెలియలేదు. అప్పటికి నాకు కొంచెము దడతగ్గింది. మళ్ళీ యిల్లాంటిపని ఎప్పటికి చెయ్యవద్దని, వాడికి గట్టిగా బుద్ధి చెప్పాలని అనుకొన్నాను. అందుకని ఒక సన్నని బెత్తము ఒకటి తీసుకొని వాడిదగ్గరకొచ్చి ''ఏం రా అసలు నీవు బావిలోకి ఎందుకు దిగాలిసి వచ్చిందో చెప్పు ?'' అన్నాను బాగా ఉరిమిచూస్తూ, బెత్తం విసురుగా ఆడిస్తూ కూడాను.

''కొట్టకండి పండగపూట''అన్నది వాళ్ళమ్మ. ''కొట్టక ముద్దెట్టుకోమంటావాకొడుకునూ, ఇల్లాంటిపనిచేసినందుకూ? వాడిని వళ్ళుచీరేస్తాను. నీవు తప్పుకో.'' అని పైకి అంటూ నురేలచెయ్యను. ఊరికే కోప్పడతాను. నీవు అడ్డంరావద్దు అని అర్థంవచ్చేలాగున ఆమెకు కంటితో సంజ్ఞ చేశాను. ఆవిడ తప్పుకు వెళ్ళిపోయింది. ''తన్నండి వెధవనుఎప్పుడూ ఇల్లాంటి పని చెయ్యకుండా'' అని అంటూ.

రాధబాబు నిస్సహాయుడు ఆయిపోయినాడు. పాప కూడా ఎదురు తిరిగింది. వాడు ఎప్పుడూ దిగుతూనేఉంటాడు నాన్నా, పడతావురా అని నేను గోలపెట్టి ఏడ్చినా వినడు నాన్నా అని వాడి స్వభావాన్ని గురించి సాక్ష్యం చెప్పింది.

నేను బెత్తము బాగా పైకెత్తి "ఏంరా బావిలో ఎందుకు దిగావో చెప్పు, చెప్పుతావా కొట్టనా?" అని అడిగాను.

బాగా ఏడ్పుముఖం పెట్టి "నేను దిగలేదు నాన్నా" అన్నాడు. తల్లికూడా దగ్గర లేకపోవడము మూలాన ఆసరా ఎవ్వరూలేరని తెలుసుకొని ఫెడేలుమని ఒకపెద్ద అబద్ధం ఆడేశాడు. అందుకని "ఎందుకురా అబద్ధము ఆడుతావూ? దిగకపోతే బావిలోకి ఎల్లాగ వెళ్ళావూ?" అని అడిగాను.

"అబద్ధాలు కాదు నాన్నా. నేను దిగలేదు." అన్నాడు మళ్ళా.

"మరేమిటి"

ఆ ప్రశ్నమీద రాధబాబు నిజంసంగతి చెప్పుతానని ఈ విధముగా చెప్పాడు.

"అదికాదు నాన్నా! బొక్కెనతో నీళ్ళు తోడు తున్నాను. అసలు నేను బొక్కెన సగానికి నీళ్ళు తీద్దామని అనుకొన్నాను. కాని ఏమైందిఅంటే అది గబుక్కున మునిగి నిండిపోయింది. చాలా బరువు నాన్నా అది. నేను లాగలేక పోయినాను" అని అక్కడ ఆగాడు.

"ఊఁ, లాగ లేకపోతే ? చెప్పు ఏమైందో" అన్నాను నేను కోపంగా, రాధబాబు బా అని ఏడ్చి ఏడుస్తూనే అన్నాడు "అప్పుడే బాగా వంగి ఇట్లా లాగుతున్నాను నాన్నా. ఆప ళంగా కాలుజారి తలక్రిందుగా పడిపోయాను నాన్నా."

మళ్ళీ పెద్దగా బావురుమన్నాడు.

వంగి తేమటుకు పడిపోతారా ? అని నాకు సందేహము కలిగింది. గోడ అవతలనుంచి, ఇదంతా వింటూన్న తల్లి తలుపు తోసుకొనివచ్చి పిల్లవాడ్ని కావిలించుకొని మా నాన్నే, తలక్రిందుగా పడ్డవురా నాన్నా ? ఎంతగండం తప్పిందో ! అంటూ వాడి నళ్ళంతా నిమిరి ముద్దెట్టుకొంది.

ఆటకోరుతనంగా బావిలో దిగి జారిపడటం కాదది. కాలుజారి పడ్డాడు. వాడితప్పు అందులో ఏమీ లేదు. వాడ్ని యింకా కోప్పడటం అన్యాయం అని నాకు తోచింది. వాళ్ళమ్మ కూడా అల్లాగే అనుకొన్నది.

"అయితే దెబ్బతగల్లేమరా ?" అని అడిగాను నేను. అంతతల్లక్రిందుగా పడితే తలకాయ వరలకు కొట్టుకో వలసింది.

దీనికివాడేమీ సమాధానము చెప్పక ఊరుకొన్నాడు. "ఎందుకు తగులుతుందండీ ? నిటారున పడిపోయాడు" అని ఆమె సమాధానము చెప్పింది.

"అంతే అయియుంటుంది నాన్నా" అన్నది పాప.

అయితే మటుకు అసలు బొక్కెన బావిలో వేసి లాగా లిసినంత అవసరము వాడికేం కలిగింది ? నీళ్ళు కావాలంటే యింట్లో లేవు కనకనా ? అందుకని ఇటువంటి పిచ్చి పనులు ఎప్పుడు చెయ్యవుగదా అంటూ కొట్టబోయాను.

వాడు మళ్ళీ బావురుమని ఏడ్చాడు. పాపం వాడితప్పు ఏముందండీ, కాలుజారి ఒరిగిపడిపోతేనూ ? అయినదానికీ కానిదానికీ కూడా దండిస్తే ఎల్లాగ ? పండగపూట పసి వాణ్ని అన్యాయముగా కొట్టేవారే. అంటూ వాడిని తల్లి దగ్గరకు తీసుకొని ఓదార్చింది.

నాకుమటుకు వాడిని అన్యాయముగా కొట్టాననన్న విచారము కలుగలేదు. అసలు నీళ్ళు తోడటానికి ప్రయత్నము చేయడము ఒకతప్పు. రెండోది చేద అంత బరువేస్తే దాన్ని బావిలోకి వదిలేయాలె, అంతేగాని దానితోకూడా లోపలికి వెళ్ళడములో వాడికేదో కొంటెతనము ఉన్నట్లే నాకు అనుమానము.

వాడు తల్లిని కౌగలించుకొని ఇంకా ఏడుస్తూ ఉంటే నాకు మళ్ళా జాలివేసింది. పండగపూట కొట్టానే అని.

పెద్ద దయ్యంలాంటి బొక్కెనకొనుక్కొని వచ్చారు. నేనే లాగలేకపోతున్నాను. వాడికేం సాధ్యమౌతుంది. క్రిందికి గుంజేసింది కామాలు ఆ బొక్కెన? లేదులే నాన్నా ఇవ్వాళరోజు అటువంటిది ! ఏంజేస్తాం ? ఇకరారా నాన్నా పోదాము అంటున్నది తల్లి.

నేనూ వెళ్ళిపోతున్నాను. ఇటు చూద్దునుగదా, అసలు ఆ బొక్కెన బావి పైనే ఉంది బండచాటున.

వాడు బొక్కెన లాగలేకపోయి పడితే, అదిబైటే, ఎందుకు ఉంటుందీ ? వాడు బ్రహ్మాండమైన అబద్ధం ఆడి అందరినీ నమ్మించాడు. వాళ్ళు ఎవ్వరూ బొక్కెన బైట ఉన్న సంగతి చూడలేదు. తల్లి అంటున్నది, "నాన్నా ఎప్పుడూ బావిదగ్గరకు వచ్చి ఇట్లాంటి పనులు చేయకేం" అని. నేను "ఏంజేశానే ? బావిలో దిగానా ఏమన్నానా ? కాలుజారి ఇట్లా ఢాం అని పడిపోయానే" అంటున్నాడు వాడు. ఈ మాటలు వింటూంటే పాపం ఆతల్లికి కళ్ళనీళ్ళ పర్యంతం అవుతున్నది.

చిన్నవాడైనా అబద్ధాలు ఆడటం బాగానేర్చినట్లుంది. ఎక్కడా జంకూగొంకూ కనపడటంలేదు. నిజంచెప్పేస్తున్నట్లే మాట్లాడుతున్నాడు ఏడ్పుముఖముపెట్టి. నాకు వళ్ళు మండి పోయింది ఈ దొంగతనంచూచి.

చివరకు నేనన్నాను, "అయితే రాధబాబూ బొక్కెన లాగబోయి పడ్డావుకదా, బొక్కెన ఏమైందిరా ?" అని. "బావిలో పడ్డది" అని ఠపీమని జవాబు చెప్పాడు తడుముకోకుండా. "మునిగిపోయిందా, తేలిందా ?" అని అడిగాను నేను. వాడు తెల్లపోయి నా వంకచూచి, "ఎక్కడన్నా తేలుతుందా ఏమిటి ?" అన్నాడు.

"అయితే, ఇదేమిటిరా ? బావిలో ఉండాలిసిన బొక్కెన పైన ఎందుకు ఉందీ ? చెప్పవేంరా ? అని అడిగాను కళ్ళు ఉరిమిచూస్తూ.

అంతా తెల్లపోయినారు. వాడూ తెల్లపోయినాడు. వాడు ఇందాకటినుండీ అల్లుకొచ్చిన కథ అంతా టపీన ఎగిరిపోయింది. వత్తిగాలిపోగుచేసి కథ అల్లాడు. అంతా నమ్మామకూడాను. వాడు చెప్పినదంతా పచ్చి అబద్ధాలు అని అందరికీ తెలిసింది. ఒక్కసారి అంతా నవ్వారు ఫక్కున.

రాధబాబు ముఖం మరీ తెల్లబడ్డది. కథ అడ్డంగా తిరిగిందని వాడికీ తెలిసింది కాబోలు బిత్తరపోయినాడు.

"కొడతారని భయపడి అబద్ధం ఆడాడు లెండి." అంటూ తల్లి వాడిని సమర్థించింది. బొక్కెనకూడా బావిలోకి గిరాటువేసినట్లు, అయితే, వాడు ఆడినఅబద్ధం అభేద్యం అయ్యేది. ఆ బొక్కెన కాస్తా బైట ఉండబట్టి అంతా బట్టబయలు అయి వాడు అబద్ధం ఆడుతున్నాడని తెలిసింది.

నాకుమటుకు చెడ్డకోపంగా ఉంది. వీడు ఇంత అబద్ధం ఆడాడే అని. ఒక వేపబెత్తము తీసుకొని "వళ్ళు చీరేస్తాను. ఎందుకు ఇంత అబద్ధంఆడావు ?" అన్నాను నేను కోపంగా.

"నేను అబద్ధం ఆడలేదు నాన్నా" అని వాడు మళ్ళీ అన్నాడు.

"అబద్ధం ఆడటంలేదు ? ఓరి కొంటెసన్యాసి, ఇంకా బొక్కెన బయవైె లాగలేకే పడ్డానూ అంటావూ ? ఇంకా

అల్లాగే అంటావా ?'' అని గర్జించినా, వాడు భయపడక 'అవును నాన్నా' అన్నాడు. నిజానికి కట్టుబడ్డవాడిలాగ చూస్తూ.

ఇంత గట్టిగా చెబుతున్నాడు. వీడిని ఏం జేసినా పాపం లేదు, అనుకొన్నాను.

అయితే బొక్కెన బావిలో ఉండాల్సింది బైటకెల్లాగు వచ్చిందిరా ? అని అడిగాను.

''ఏమో ఎట్లాగొచ్చిందో'' అన్నాడు. ఏమంటాడు అంతకంటే. వాడనటం బొక్కెనకు కాళ్ళొచ్చి అదంతట అదే బైటకొచ్చిందని.

ఇదివరలో మాయింట్లో గాజుగ్లాసులూ, చిమ్నీలూ వాటంతట అవే పగులుతుండేవి. సిరాబుడ్లు బల్లమీద వాటంతటఅవే వలికిపోతుండేవి. సిరా అంతా పుస్తకాల మీద పడ్డతరువాత ఆబుడ్లు మళ్ళీ వాటంతటఅవే లేచి స్వస్థానములో ఉంటూఉండేవి.

మంచినీళ్ళలోకి బొగ్గులు వాటంతటఅవే వచ్చి పడి తేలుతూ ఉండేవి. ఇటువంటి గారడీలు చెయ్యటం మావాడికి బాగా తెలుసు. అల్లాగే బొక్కెన కూడా దానంతటఅదే బావిలోనుంచి ఎగిరి బైటకొచ్చి కూర్చున్నది అన్నమాట ?

ఇటువంటి అబద్ధాలు ఆడినందుకు సరియైన శిక్ష విధించకపోతే పీడు ఎందుకూ పనికిరాకుండాపోతాడు. అంటూ ఆ వేపపుడకతో ఒక్కటి వేశాను.

వాడు బిక్కముఖముతో నన్ను చూచి ఏడ్చాడు, తల్లి వాడిని తన చాటుకు తీసికొని లోపలకు తీసుకుపోయింది.

నేనింకా అక్కడే నుంచున్నాను. వాడు ఇంతకూ నిజం ఒప్పుకోలేదు. ఆపళంగా వాడ్ని వదిలేస్తే ఏమైనట్టు ? ఇంకా రెండు తగిలిస్తేగాని నిజం ఒప్పుకోడు. తగిలిన రెండు దెబ్బలూ ఏమంత గట్టివీ కావు.

పసితనంలో ఏదో అబద్ధం ఆడాడులే అని సరిపెట్టుకొని ఊరుకుంటే, వాడు యింకా అబద్ధాలు ఆడటం నేర్చుకొంటాడు. వాడిచేత నిజం చెప్పించి, అబద్ధం ఆడితే లాభం లేదనీ, నిజం దాగదనీ, వాడు తెలుసుకొనేటట్టు చెయ్యాలి.

అదీగాక తాను చెప్పినదంతా వట్టి అబద్ధం అని బైట పడ్డా ఇంకా దబాయిస్తున్నాడు. నీవు చెప్పిందే నిజమైతే బొక్కెన బైట ఎల్లాఉందిరా ? అని అడిగితే 'ఏమో ఎట్లా ఉందో' అనటం దబాయింపుగాక మరేమిటి ?

చేసినతప్పును కప్పిపుచ్చటానికి ఒక అబద్ధం ఆడటం ! దానికిపోటీ ఇంకో అబద్ధం ! ఆ రెండూకూడా నిలబడలేక పోతే డబాయింపు ! ఇల్లాంటి ప్రవర్తన అలవాటైతే ఇంకేమన్నా ఉందా ?

అని నేను ఇల్లాగ చాలసేపు ఆలోచించుకొని ఏమైనా కానీ, వీడిచేత ఇవ్వాళ నిజం చెప్పించాలె. సత్యాన్ని వాడి నోటితోనే పలికించాలె. బెదరించిచూస్తాను. నిజం ఒప్పుకొన్నాడా సరేసరి, బెదిరింపులకు లొంగకపోతే ఇంకా రెండు గట్టిదెబ్బలు వెయ్యటానికికూడా సందేహించకూడదు. తండ్రి అయినవాడు చెయ్యాలిసిన విధి ఇది. అని నిశ్చయించుకొని ఇంట్లోకి వెళ్ళాను.

నా నిశ్చయం నా నడకలోకి నా ముఖంలోకి నా చూపుల్లోకి పాకింది. రాధబాబుకు కొత్త చొక్కా తొడుగుతున్న తల్లే నన్నుచూచి బిత్తరపోయింది. కోపాన్ని కక్కుతున్న నా కళ్ళనూ, బిగబట్టిన పళ్ళనూ చూచి రాధబాబు గజగజ వణికిపోయాడు.

నేను వాడిదగ్గిరకెళ్ళి అన్నాను "ఒరేయ్! నీవు అబద్ధంఆడావు. నీవు అబద్ధాలుఆడావని వీళ్ళందరికీ తెలుసు!" అని మా ఆవిడవంక తిరిగి ఏమే వీడు అబద్ధం ఆడుతున్నాడంటావా ? లేదంటావా ? అని అడిగాను మండిపోతూ.

"ఆఁ అబద్ధంకాక నిజం చెప్పాడని ఎవరంటున్నారు ? పసివాడు కాబట్టి క్షమించి ఇంతటితో పోనీయమంటున్నాను" అన్నది.

"అబద్ధం ఆడానని ఒప్పుకోమను వాడిని. ఒప్పుకొని ఇంక ఎప్పుడూ అబద్ధం అనేది నోట రానీయనూ అంటే క్షమించి ఊరుకొంటాను. లేదో ఇవ్వాళ వాడి పళ్ళు

పగిలిందే'' అంటూ మా ఆవిడను కెక్కుచ్చుకొని వాడిదగ్గర నుంచి అవతలకు లాగేసి బెత్తం పైకెత్తాను.

పిల్లవాడ్ని బాగుచేసి మంచిమార్గానికి త్రిప్పి సత్ పథంలోపెట్టాలన్న ఆవేశమే నాకుతాత్కాలికంగాకోపాన్ని తెచ్చిపెట్టింది. కొట్టటానికి సిద్ధం అయినాను

నేను బెత్తం పైకెత్తేసరికి పాప కెవ్వున కేక పెట్టి ఏడ్చింది. హడలిపోయి నాఉగ్రంజూచి, అడ్డం రావటానికి సాహసించలేక మా అవిడ కూడా దిగులుముఖంతో కొడుకు వంక చూసింది.

ఇక రాధబాబు సంగతి చెప్పనక్కరలేదు. నోట మాట రాలేదు. నిశ్చేష్టుడైపోయి, కళ్ళనీళ్ళు కారుస్తూ నించున్నాడు.

నేను ఎత్తిన బెత్తం ఎత్తినట్లేఉంచి, ''ఏంరా అబద్ధం ఆడావా?'' అని ఒక పెద్దరంకె పెట్టాను. వాడు వణికిపోతూ అవునన్నట్లు తలఊపాడు.

''బావిలో దిగాలని దిగావు కదూ ?''

''అవును''

''దేనికోసం దిగావు?''

''ఊరికేనే.''

''సరదాకా ?''

"ఆ."

"ఇంకెప్పుడూ అల్లాగ దిగవుకదా ?"

"దిగను."

"ఇంకెప్పుడూ అబద్ధాలు ఆడవుకద ?"

"ఆడను."

"ఇంకోమారు అబద్ధం ఆడావంటె, కొట్టేస్తాను తెలిసిందా?"

"ఆ."

నిజం ఒప్పుకొన్నాడు. ఇహ వాడిని ఒదిలేయాలను కొన్నాను. ఆ సమయానే తల్లివచ్చి కొడుకుని రెండుచేతు ల్లోకి తీసుకొని, ఇహ వెళ్ళండి నిజం చెప్పాడుగా. "ఇహ ఎప్పటికీ అబద్ధంకూడా చెప్పడు." అంటూ వాడిని వంట ఇంట్లోకి లాక్కెళ్ళింది.

పాప వచ్చి నేను గోడకు ఆనించిపెట్టిన బెత్తాన్ని తీసు కొని ముక్కలుముక్కలుచేసి పారేసింది. "నిజం చెప్పబట్టి సరిపోయింది, లేకపోతే నాన్న ఆ కోపంలో పాపం వాడ్ని బాదేసిఉండును." అంటున్నాడు శాస్త్రి వాళ్ళమ్మతో.

నాకు చాలాసంతోషం కలిగింది చెయ్యి చేసుకోకుం డానే వాడిచేత నిజం ఒప్పించగలిగినందుకు. వాడిని పండగ పూట ఏడిపించానే అని జాలికూడా వేసింది. ఇంతకూ ఏం జేసినా వాడి బాగుకోరే గదా చేసింది అని నాకు నేనే సమాధానము చెప్పుకొన్నాను.

"నిజంబప్పుకోన్నాడు. అదేసంతోషం" అనుకొంటూ దొడ్లోకి వెళ్ళాను. మా ఇంటిప్రక్క ఆవిడ అక్కడ బావి దగ్గర దేనికోసమో అటు ఇటూ చూస్తున్నది. కాసేపు నేను అక్కడే నుంచున్నాను, జామచెట్టువంక చూస్తూ. ఆవిడ బావికి నాలుగుప్రక్కలా దేనికోసమో వెతికింది. కన పడ లేదు కామాలు. అయోమయంగా చూస్తూ లోపలికెళ్ళి వంటయింటి గుమ్మంలోనుంచుని అడుగుతున్నది మా ఆవి డను "ఏమమ్మా కాంతమ్మ ఒదినే చేద కనపడదేం?" అని.

"బావిదగ్గరనే ఉందమ్మా చేదా" అన్నది మా ఆవిడ. "అది మీ బొక్కెనమ్మా, మాబొక్కెన ఒకటి ఉండాలె. ఇందాకా తెచ్చి ఒక బిందెడు నీళ్ళుతోడుకెళ్ళి మళ్ళీ ఇంకోబిందెకు ఎల్లాగూ రావాలె గదా అని ఇక్కడేపెట్టి వెళ్ళాను. ఉంతా మీ దానిమోస్తరే ఉంటుందిలే, ఒకవేళ అదే మీది అనుకొని ఇంట్లో పెట్టావేమోఅని అడుగు తున్నాను" అన్నది ఆవిడ.

ఈ మాటలు నా చెవినిబడ్డయి. వళ్లు ఝల్లుమంది. వీపుపైన ఛెళ్లున కొట్టినట్లు అయింది.

ఇంతలోమాఆవిడ వంటయింట్లోనుంచి ఒక్కగంతులో దొడ్లోకి వచ్చి, నావంక చురచురా చూస్తూ అడిగింది.

"విన్నారా ?"

"ఏమిటి ?" అన్నాను నేను ఏమీ ఎరగనట్టు."

"ఏమిటి ? వదినగారు చేద ఇక్కడ వదిలేసిపోయింది. రాధబాబు దాన్నే బావిలో పడేసి ఉంటాడు."

"అంతే అయిఉంటుంది" అన్నాను నేన చమత్కారంగా. "ఎంత నిర్లక్ష్యంగా అన్నారండీ? రాతి గుండెమీది. నేను మొట్టమొదటినుండీ మొత్తుకుంటూనే ఉన్నా వాడి నేమీ అనకండి అని, నిజం ఒప్పిస్తా నిజం ఒప్పిస్తానంటూ, అంతెత్తు లేస్తిరి. నోరెత్తితే నామీద ఎక్కడ విరుచుకు పడతారో అని నోరు నొక్కుకొని ఊరుకొన్నాను. చెప్పించారు! నిజం !" అని ఈసడిస్తూ కళ్ళ నీళ్ళు తుడుచుకొంది.

"ఏం జేశానూ ?" అన్నాను నేను క్రుంగిపోతూ.

"ఏంజేశారా ? ఏమీ ఎరగని అమాయకపు చిన్న సన్యాసికి అబద్ధం ఆడడం నేర్పారు." అని మరోసారి కళ్ళు ఒత్తుకొని వెళ్ళిపోయింది.

క్రుంగిపోయి, నీరసంగా, దిగులుగా పశ్చాత్తాపముతో నిలబడిపోయినాను.



# ఔట్ హౌస్

మా ఆవిడ పిల్లలను తీసుకొని పుట్టింటికెళ్ళింది. మళ్ళీ పదిరోజులలో తిరిగి వస్తానన్నది. పదిరోజుల భాగ్యానికి హోటల్లో చేరటం ఎందుకని నేనే చెయ్యి కాల్చు కుంటు న్నాను.

మా ఆవిడ వెళ్ళిన మరునాడే మా మేనత్త వచ్చింది. చాలా రోజులైన తరువాత మా అత్తను చూచాననే కాకుండా, ఈపదిరోజులూ, చెయ్యికాల్చుకోకుండాపోతుంది గదా అని నేను ఎంతో సంతోషించాను.

కాని వచ్చినరోజు సాయంత్రమే ఆవిడ అన్నది. ''రేపు ప్రొద్దున బండికి నేను వెళ్ళుతారానాయినా''అని. ''ఏమమ్మా అప్పుడే వెళ్ళటం ఏమిటి? ఏం రావటం! ఏం పోవటం! మీ కూతురూ పిల్లలూ రెండుమూడు రోజులలో వస్తారు. ఉండి పిల్లను చూచిపో'' అన్నాను.

''కాదులే నాయినా తొందరపని ఉంది. నేను రావ టమే, అసలు ఓ అర్జంటుపనిమీద వచ్చాను. అసలు నేను కదలేదాన్నా!

ముసలాయనకు వంట్లో ఏమీ బాగుండలేదు. ఆయ నకు పథ్యం పానం నేను చేసిపెట్టాలిసిందేగాని కోడలుకేమీ

తెలియదు. అదీగాక దానికి నిండు నీళ్ళాడ పొద్దులూ! ఇవ్వాళా రేపో అనుకుంటున్నాము. నన్ను బలవంత పెట్టక వెళ్ళనియ్యి" అన్నది.

"అల్లాంటప్పుడు నీవు ఇల్లు కదలవలసిన అవసరమేమి వచ్చిందమ్మా" అని అడిగాను. "ఏంజేసేది నాయినా? ఆ నాంచారమ్మ, ఒక్కతీరాన కళ్ళా గడ్డం పట్టుకొని బ్రతిమిలాడి పంపింది."

"ఎందుకూ?"

"అదో గొడవ ఉందిలే! ఈవూళ్ళో ఓ మంచిభూత వైద్యుడున్నాడు. ఆయన్ను తీసికెళ్ళటానికే వచ్చాను. రేపు ప్రొద్దుటి బండికే ఆయనా వస్తాడు. ఇద్దరం కలిసే వెడతాము."

"భూతవైద్యుడు? అయితే ఏదో గాలి సోకిందా ఏమిటి ఆమెకూ?"

"అవునురా నాయినా, మన ఇంటిప్రక్కనేగా వాళ్ళ ఇల్లు! ఆ ఇంట్లో ఒక దయ్యం ప్రవేశించింది!"

దయ్యాలయందు నాకు అట్టే నమ్మకంలేదు. అందుకని హేళనగా మాట్లాడాను. "దయ్యం! దయ్యం ఎట్లా ప్రవేశించిందమ్మా" అని.

"ఎట్లాగో, దయ్యాలు వచ్చేదారులేవో మనం చెప్పగల్గుదుమా! ఎట్లాగో ప్రవేశించింది" అన్నది ఆవిడ.

"ఎవ్వరూ చూడలేదు అన్నమాట!"

"ఎట్లాచూస్తారురా? అయినా చూస్తుండంగావస్తుందా దయ్యం ?"

"అయితేగొంగదయ్యంఅన్నమాట" అన్నాను నేను. మా అత్తయ్య ఈ పిచ్చి మాటలు విని విసుక్కొని ఊరుకొన్నది. కాని నాకు ఆదయ్యం ఎల్లాంటిదో ఏమిటో తెలుసుకోవాలెనని ఉండటం వల్ల "ప్రవేశించి ఏంజేసేదమ్మా" అని అడిగాను.

"ఎందుకూ చెపటం ? నీవు అంతా వట్టిదే అంటావు ఈ ఇంగ్లీషు చదువుకొన్న వాళ్ళందరికీ ఇనొకటి ! దయ్యాలంటే నమ్మకం లేదు."

"నమ్మకం లేక పోవటానికి కారణం ఏమిటంటే దయ్యాన్ని నేను చూశాను. అని చెప్పగలవాళ్ళు నాకెవ్వరూ ఇంతవరకు కనపడలేదు."

"అయితే అబ్బాయీ కనపడటానికి వీలులేని వస్తువ ఎల్లాగ కనపడుతుందిరా ? నీకు గాలి కనపడుతుందా ? దయ్యమూ గాలే, కాబట్టి అది మన కళ్ళకు కనపడదు."

"గాలి మనశరీరానికి చల్లగానూ, వెచ్చగానూ తాకటము మనం తెలుసుకోటం లేదుటమ్మా?"

"ఇంకేం. అల్లాగే దయ్యం. అదిచేసే పనులవల్ల దాని సంగతి తెలుస్తుంది."

మా అత్తయ్య చెప్పినమాట నిజమే అనిపించింది. కార్యాన్ని బట్టి కారణం ఊహించటం సరియైన పద్ధతే. అందు కని నేను మళ్ళా అడిగాను. "ఏం జేస్తుంది అత్తయ్యా కాస్త నాకు చెప్పు వింటానూ" అని.

"ఏం జెయ్యటమేమిటి? నానా అల్లరీ చేస్తుంది!"

"అరుస్తుందా!"

"ఇంకా అది కూడా ఉంటే ఈ పాటికి అందరి ప్రాణాలు పోయేవే!"

"మరి ఏమిటి అది చేసే అల్లరి?"

"చెప్పితే నమ్మవుగాని నేను కళ్ళారాచూశానురా!"

"ఏమిటమ్మా అది?"

"ఏమిటా? ఒక రోజున నేనూ నాంచారమ్మ ఇల్లాగే కూర్చుని మాట్లాడుకొంటున్నాము, ఏదో పిచ్చపాటీనూ. ఇట్లా మాట్లాడుకొంటూనే ఉన్నాము. ఇంతలో ఆ దయ్యం వచ్చి నాంచారి వీపు పైని ఫెడీమని చరిచింది!"

"అంతగట్టిగా కొట్టటం ఏం బాగుండ లేదు. నాంచా రమ్మ చక్కనిది కూడా. వీపు ముద్దెట్టు కోవాలిసింది."

"ఒరేయ్ నీదంతా వేళాకోళం! అందుకనే నీకు చెప్ప నన్నాను. నేను కళ్ళార చూశానుగదా, మాట్లాడుతూ మాట్లాడుతూ ఆమె అమ్మయ్యో అని కేకెట్టి పెళ్ళున విరుచుక పడిపోవటం!"

"అదేదైనా జబ్బు అయివుంటుందమ్మా అత్తా!"

"జబ్బు కావలసిందే! నేను బాగా ఎరుగుదును. ఏహేం జబ్బూ లేదు దుక్కలాగుంది. తింటుంది తిరుగుతుంది. నిద్ర పోతుంది. జబ్బు మనిషి అయితే కనబడదురా, ఎందుకు పోవటమూ, ఆర్చుకు పోవటమూనూ! ఏమీ లేందే! నిక్షేపం లాగుంది. ఆదయ్యం కొట్టినపుడు మాత్రం విరుచుకు పడు తుంది."

"ఆదయ్యం వల్ల అంతకంటే ఇంకేమీ బాధ లేదా?"

"సారె! అదొకటేనా? అర్ధరాత్రి వేళ అటకపైనున్న చెంబులు తప్పాలాలూ ఉహు గలగల్లాడిస్తుంది"

"ఎందుకో?"

"నాబొంద ఎందుకేటి! ఇంట్లోవాళ్ళని హడలగొట్టి చంపటానికి!"

"పంది కొక్కులూ అల్లాంటివి ఏమైనా చెంబు తప్పాల లను కదిలిస్తూ ఉన్నాయేమో?"

"పంది కొక్కులు కావలసిందే! పాత్రసామాగ్రిని ఎత్తిపడేసినట్లు శబ్దంఅవుతుంటేనే! అంతమాత్రం తెలియదూ పోనీ అది అట్లా ఉంచు! దీనికేమంటావు? [illegible] మేము చూస్తూ ఉండంగానే దభీలున పడి పోయింది! మరి ఏమిటి చెప్పుఇది? ఇల్లాంటివే అన్నీ అల్లరి చేష్టలు చేస్తున్నది అదృశ్యం."



"అల్లరి దయ్యం అన్న మాట అక్షరాల్లా అది వట్టి అల్లరి దయ్యం" అని నేను ఆదయ్యపు స్వభావాన్ని గురించి ఆలోచించగా తేలిన సారాంశం చెప్పాను.

ఆవిడ ఏమీ సంతోషించక మళ్లీ ఇల్లాగ అన్నది. "అది ఆ ఇంట్లో చేసే అల్లరి ఇంతా అంతా కాదు. దీని దుంప తెగ ఎక్కడనుంచి తెస్తుందో రోజూ ఇటుకముక్కను తెచ్చి ఇంటినిండా పడేస్తుందిరా!"

ఇదేదో తమాషే అనిపించింది "ఇటుక ముక్కలు తేవటం ఏమిటమ్మా?" అన్నాను.

"ఇటుకలురా, మనం గోడ కట్టుకొనే ఇటుకలు చూశావుగా అవి!! తెల్లవారేటప్పటికి ఒకకుప్ప తయారూ అవి తీసి పారేస్తే, మళ్లీ మామూలే తయారూ!! ఇల్లాగ నానా గోలనూ!"

అన్నది ఆవిడ నిద్ర కళ్ళతో.

4

"ఇంటి నిండా ఇటుకముక్కలు పడేస్తూఉంటే చికాగ్గానే ఉంటుంది. మరి ఇప్పుడేంజేస్తున్నారూ ?"

"ఏం జేస్తూన్నారూ, దాన్ని వదిలించుకోవాలనిసకల ప్రయత్నాలూ చేస్తున్నారు. ఈవూళ్ళో ఓ గొప్ప భూత వైద్యుడు ఉంటె ఆయన్ను పిలుచుకు వెడదామని వచ్చాను."

"భూతవైద్యుడు వల్ల అవుతుందంటావా?" అని అడిగాను.

"ఆ భూతవైద్యుడు మంత్రాలు చదివి ఆదయ్యాన్ని అక్కడనుంచి తోలేయ గలడు." అని చెపుతూనే ఉంది ఎప్పుడు నిద్రపోయిందో నిద్రపోయింది ఆమె. ఆ తెల్లవారు ఝాముకే ఆమె రైలుకు వెళ్ళిపోయింది.

౨

నాకు మటుకు ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఒకటే ఆలోచన దయ్యాలను గురించి. ఈ మధ్యకొన్ని ఇంగ్లీషుపుస్తకాలు చదివాను. కానొండైల్ కార్పెన్టర్ మొదలైన వారు దయ్యాలు ఉన్నవి అని వ్రాసిన మాటలు జ్ఞాపకం వచ్చినై మా అత్తయ్య తాను కళ్ళారచూచిన విషయాన్ని నేను కాదని ఎలాగ త్రోచిపుచ్చేదీ ? ఆలోచించి ఆలోచించి చివరకు, ఒకవిధంగా దయ్యాలు ఉన్నవి అనే నిశ్చయానికే వచ్చాను.

ఆతరువాత ఈ నాంచారమ్మగారి ఇంట్లో ప్రవేశించిన దయ్యాన్ని గురించి ఆలోచించాను. అది యిటుకలు తెచ్చి పడేస్తుంది అన్న విషయమే నన్ను ఎక్కువగా ఆకర్షించింది. ఇటుకలు ఇప్పుడు చాలా ప్రియంగా ఉన్నవి. వెయ్యి ఇరవై రూపాయలకు తక్కువలేదు. కాబట్టిఅల్లాంటి దయ్యం ఒకటి మన ఇంట్లో ఉండటం చాలా అవసరమని తోచింది.

ఎట్లాగూ దొడ్లో ఒక చిన్న అవుట్‌హౌస్ వేయిద్దామని చాలా రోజులనుంచీ అనుకుంటూనే ఉన్నాను. ఆ దయ్యం పుణ్యమా అంటూ రోజుకో నాలుగు వందల ఇటుకలు తయారుజేసి ఇచ్చిందా మనకు ఏఇబ్బందీ ఉండదు.

నాకు మహాకావలిస్తే ఇరవై వేల ఇటుక కావాలె. నెలాపదిహేను రోజుల్లో తయారుజేసి ఇస్తుంది. దాని తరువాత అది ఇచ్చే ఇటుకలన్నీ పోగుజేసుకొని అమ్ముకోవచ్చు. చాలా లాభకరమైన పని. ఆ దయ్యాన్ని మా ఇంటికి తీసుకురావాలె. ఈ ఉపాయం నాకు తోచినందుకు నాకు చాలా సంతోషం కలిగింది.

అయితే ఆదయ్యం మన ఇంటికి వచ్చేటట్లు చెయ్యటం ఎల్లాగు ? ఆ భూతవైద్యుడినే అడిగితే ఆ దయ్యాన్ని తీసుకొచ్చి మా ఇంట్లో వదలివేయమని ? వెళ్ళగొట్టటానికి చేతనైన వాడు తీసుకురాలేక పోతాడా ! కాని ఒకరితో ఈవిషయం చెప్పటానికి నాకు మనస్కరించ లేదు.

కాని ఆదయ్యం వల్ల నాకు చాలా లాభం కలుగ బోతున్నది. కాబట్టి ఎల్లాగైనా దాన్ని రాబట్టటం నాకు అవసరమని తోచింది.

అందుకని నేనే స్వయంగా ప్రార్థించాను.

"నాంచారమ్మ గారింట్లో ఉంటూఉన్నట్టువంటి ఓ దయ్యమా! నిన్ను అక్కడనుంచి వెళ్ళగొడితే నీవేమీ విచారపడవద్దు. అంత వద్దు అంటూవుంటే వాళ్ళ ఇంట్లోనే ఉండటం నీకేం ఖర్మం? నీవు యకాయకీని మాయింటికి వచ్చేసెయ్యి" అని మనఃపూర్వకంగా ప్రార్థించాను. ఆ నిశ రాత్రివేళ ఒంటరిగా మంచంమీద కూర్చుని.

నా ప్రార్థన అంగీకరించి ఆ దయ్యం మా యింటికి వస్తుందా అని సందేహం కలిగింది. ఎందుకు రాకూడదు వస్తే రావచ్చు వస్తే అదృష్ట వంతుడ్నే. ఇటుకలు తెచ్చి పెట్టగల దయ్యం బంగారం తెమ్మన్నా తేగలదేమో!

అల్లా ఉద్దీన్ కథ జ్ఞాపకం వచ్చింది. అదొకక తమాషా అయిన కథ అనే యింతవరకూ అనుకొన్నానుగాని యిప్పుడు అది నిజమైన సంగతేనని తోచింది. ఇటుకరాళ్ళు తెచ్చి పోయగల దయ్యం ఉన్నపుడు, బంగారం తేగల దయ్యం ఎందుకు వుండకూడదూ? ఈదయ్యానికే బంగారం తేగల శక్తికూడా తప్పకుండాఉండి ఉంటుంది. నేను నిజంగాఅదృష్ట వంతుడ్ని అనుకొన్నాను. నాభార్యకు ఓగొలుసు చేయించా

లన్న విషయం కూడా ఆ సమయాన్నే జ్ఞాపకం వచ్చింది.

బంగారమే తేవాలెగాని రోజుకు రెండు తులాలు తెచ్చినా చాలు. కోలార్ జిల్లాలో గనులు త్రవ్వి బంగారం చేస్తున్నారు. అక్కడనుంచి తెచ్చిపెట్టు అని చెబుదామను కొన్నాను కూడా.

అది బంగారం తెచ్చి ఇయ్యలేదేమోనని నాకేవిూ సందేహం కలుగలేదు. తెచ్చియిస్తుందనేనమ్మకం కలిగింది. కాని ఈ సంగతి ప్రభుత్వం వారికి తెలిస్తే వారునాపైనిపెద్ద పన్ను వేస్తారేమోనని భయం కలిగింది. ఈ ఆలోచనవచ్చే సరికి గుండె గుభేలు మంది. ఏ మాత్రం డబ్బుఉన్నదని తెలి సినా గవర్నమెంటు వారు భరింపరాని పన్ను వేస్తున్నారు. రాజాధిరాజులే గడగడవణికిపోతున్నారు. నేనుఇవ్వలేనంత పన్ను వేస్తే నాగతి ఏంకావాలె! ఈదయ్యం బగారం తేవటం మానినేసినా పన్నుమటుకు వదలరు. అదీకాకా దయ్యం ఒకటి మా ఇంట్లో బంగారం చేస్తున్నదని ఆ చోకీ వారికినా ప్రభుత్వం వారు వెంటనే ఆ దయ్యాన్ని ఆహ్వానించి తీసు కెడతారేమో! కాబట్టి రెండో కంటివాడికి తెలియకుండా ఆదయ్యాన్ని మా ఇంట్లో దాచేసెయ్యాలె. బంగారం చేస్తు న్నట్లుకూడా ఎవ్వరికీ తెలియనీయకూడ దని నిశ్చయించు కొన్నాను.

ఒక్కటైనా ఇయ్యటంలేదు. అని యిల్లా సరిపెట్టుకుంటూ వచ్చి, చివరకు కట్టెపుల్లలు తెచ్చి పెట్టినా చాలునను కొన్నాను. ఈ రోజుల్లో అడితీల వద్ద చేరిన గుంపులలో జొరబడి తోసుకొని నానా అవస్థపడ్డా మూడు పుల్లలు దొరకటంలేదు. ఏదో, ఇంతకూ అది రావాలె గాని ఏదో విధంగా సాయపడక పోతుందా అని అనుకొన్నాను.

"ఎందుకు రాదూ ? ఆ దయ్యాన్ని ఆహ్వానించాను భగవంతుడ్ని కూడా ప్రార్థించాను వచ్చేటట్లు చేయమని ! ఇంకా ఏమి చేయాలె ? భగవంతుడు ఆజ్ఞ యిస్తే వచ్చి తీరుతుంది. కాని ఆ భగవంతుడు, ఆ పానకాలరాయుడు, ఆజ్ఞ యిస్తాడా ?"

ఇల్లా అనుకుంటూ ఉండంగానే జ్ఞాపకం వచ్చింది. అరెరే పానకాలరాయుడికి ఎందుకు మొక్కుకున్నానా అని!

ఎందుచేతనూ అంటే పానకాలరాయుడు సగభాగం చెవులు మెలేసి లాక్కునే స్వభావంగలవాడు. చాలా పొరపాటుఅయిపోయింది. తీరా మొక్కుకొన్నాను. ఇప్పుడు యింకో దైవానికి మొక్కు బదిలీ చేస్తే పానకాలరాయుడికి తప్పకుండా కోపం వస్తుంది. "నాకు సగం యివ్వాలిసి వస్తుం దని వీడు యింకో దేవుడ్ని ఆశ్రయిస్తాడా ? వీడి పనిపట్టిస్తా నుండు" అని ఆయన అనుకొంటే అనుకోవచ్చు. ఏమన్నానో అన్నాను. పానకాలరాయుడుమీదే భారం వేద్దామని

అయితే దానికోసం తలుపులు తెరిచి ఉంచాలా వద్దా అన్న సందేహం వచ్చింది. అది తీరా వచ్చేసరికి తలుపులు వేసి ఉంటే ఏమనుకొంటుంది? నేను యింతదాన్ని వస్తే వీడు తలుపులు వేసి ఉంచుతాడా? యిదేనా ఆహ్వానం ఇదేనా మర్యాద! ఛీ వీడి గడప తొక్కకూడదు అని వెళ్ళి పోతుందేమో అని భయంవేసింది!

అల్లా అని తీసి ఉంచుదామా అంటే ఒక యిబ్బంది ఉంది. ఊరి బయట ఇల్లు మాది. దయ్యం రావటమూ మాకు బంగారం చేసి యివ్వటమూ. ఎల్లాఉన్నా ముందు యింట్లో ఉన్నది కాస్తా ఊడ్చుకు పోతుంది!

ఏం చేయాలిసింది నాకు తోచలేదు. చాలా చికాకేసింది. ఏమిటీ వేధన పీకులాట అసలు ఈ ఆలోచనలే వదిలేద్దామా అన్నంత విసుకేసింది. కాని ఇంతలో, అబ్బాయీ, ఈమాత్రం కష్టపడకపోతే నీవు ధనవంతుడు ఎల్లాగ అవుతావు? కాబట్టి శ్రమపడి ఆలోచించు, అని ఎవరో చెప్పినట్లు అయింది.

ఆ సమయానికే ఒక చక్కని ఆలోచన గబుక్కున తట్టింది. తలుపుతీసి ఉంచనక్కరలేదు. కిటికీలోనుంచికూడా దయ్యం రావటానికి వీలుందీ అని. దయ్యాలు సూక్ష్మజీవులు కాబట్టి, కిటికీచువ్వలూ అవీ, వాటికేమీ అడ్డంగాదు సరే అనుకొని కిటికీతలుపులు తీసిపెట్టి పడుకొన్నాను.

కాని నిద్రపట్టలేదు. ఓ పెద్ద ఆలోచన నన్ను చాలా బాధించింది. అసలు దయ్యాన్ని ఇంట్లో ప్రవేశ పెట్టటం మంచి పనా అని. పరిచయంలేని మనిషినే రానియ్యమే మన యింట్లోకి వాడు ఎట్లాంటి వాడో అన్న భయంతో! అట్లాంటప్పుడు ముక్కూ మొహం తెలియని దయ్యాన్ని యింట్లోకి తీసుకొచ్చుకోటం అంత తెలివైన పనికాదేమో అనుకొన్నాను. అదీకాక ఆదయ్యం ఎవరో! ఎవరైనా మన స్నేహితుడి దయ్యం అయితే, యింత ఆలోచన ఉండేది కాదు. యిది బొత్తిగా కొత్తదయ్యమాయె!

ఏమీ పాలుబోక ఊహలు ఆలోచిస్తూ పడుకొన్నాను. భయం వేసింది. యింతలో దూరాన ఎక్కడో జట్కా నడుస్తూ ఉన్నట్లు శబ్దంకూడా వినిపించింది. యింకేం, అదే వస్తున్నది అనుకొన్నాను.

చాకలిదయ్యాలు చేరినచోట పల్లకీమోత వినపడు తుందనీ, బ్రాహ్మణ దయ్యాలు చేరినచోట వేదాధ్యయనం జరుగుతూ ఉంటుందనీ, మామామగారు చెబుతూ ఉండే వారు. ఈ దయ్యం పూర్వాశ్రమంలో జట్కా ఎక్కితిరు గుతూ ఉండేదై ఉండవచ్చు. యింతలో జట్కాచక్రాలు రోడ్డుపై దొర్లుతున్న శబ్దం మరీ మరీ దగ్గరగా వినపడటం సాగింది. ఆ శబ్దం మరీ దగ్గరకు వస్తున్నట్లు తోచిన కొద్దీ నాకు గుండెల్లో దడ ఎక్కువైంది.

ఇంకాసేపట్లో ఆ జట్కా మాయింటిముందు ఆగటం, ఆ దయ్యం కిటికీగుండా యింట్లోకి ప్రవేశించటం జరగబోతున్నదీ అని అనుకొనే సరికి ఎక్కడ లేని భయమూ పట్టుకొన్నది. అది నాకు ఉపకారం చేసేదే, అనుకోండి, ఎట్లాగైనా అది దయ్యంకాని మనిషి కాదు! దాన్ని యింట్లో ప్రవేశపెట్టటం విషయంలో ససేమిరా మనస్సు ఒప్పుకోలేదు.

ఎట్లాగ భగవంతుడా అని ఆలోచనలోకి దిగాను. చటుక్కున మెరుపులాగ ఒక ఊహ నామనస్సుకు తట్టింది.

వెంటనే లేచి ఒక కాయితం కలం తీసుకొన్నాను. దానిపైన వ్రాశాను "మహాశయా మీరు ఎవరో నాకు తెలియదు. మీ సుగుణ సంపత్తిని గూర్చి విని మిమ్ములను ఆహ్వానించాను. మీకు స్వాగతము. ముఖ్యంగా మీ వలన సాయం పొందాలనే నా ఆశయం. మీరు ఏదో ఒక విలువ గల వస్తువ తెచ్చి మా యింట్లో పడేస్తూ ఉండండి మీకు తోచినది. వీలైతే బంగారం. ఆ విషయం మీ అనుగ్రహానికి వదిలేశాను. మీరు చేసిన సాహాయ్యానికి నేను ఎప్పుడూ కృతజ్ఞతకలిగి ఉంటాను. బైటవరాండాలో వేసియున్న పడక కుర్చీలో తాము శయనించ వచ్చును."

అని ముభావంగా వ్రాసి దానిని మా గేటు తలుపు సందులో పెట్టాను. ఆ తరువాత కిటికీ తలుపులన్నీ మూసి నిద్రపోవాలని పడుకొన్నాను.

నిద్రపట్టలేదు. ఎవరో వీధిలో నడుస్తున్నట్టే శబ్దం అయింది. ఎవరో వస్తున్న చప్పుడు స్పష్టంగా వినవచ్చింది.

ఆ శబ్దం అంతకంతకు దగ్గరగా వినవచ్చింది. గేటు దగ్గర ఎవరో మనిషి నిలబడి ఉండాలె! లేకపోతే అంత స్పష్టంగా ఆశబ్దం వినపడదు. ఇంకెందుకు! ఎవరో గేటు తీస్తున్నట్లు కూడా తెలుస్తునే ఉంది!

వస్తున్నదీ అనుకొనే సరికి గుండెలోతుపాకిపెట్టి పేల్చి నట్లు అయింది. యోగ్యతగల దయ్యం ఒకటి మన యింటికి వస్తూవుంటే, యింత భయం నాకు ఎందుకు కలగాలో నేను చెప్పలేను.

"దారినిపోయే తద్దినాన్ని నెత్తిన ఎక్కించుకోటం అంటే యిదేరా. బంగారం చేసిపెడితే మటుకు దయ్యాన్ని యింట్లో చేరనిస్తారా! వెర్రినాగన్నా ఎంతపనిచేశావు! ఎవ రన్నా వింటే నవ్వుతారు." అని ఎవరో పెద్ద కేకలు పెట్టి నట్లు తోచింది.

ఛా, లేచి పోయి, దాని కాళ్ళమీదపడి యిటుకరాళ్ళూ వద్దూ, యినపమేకులూ వద్దు తల్లీ, నీదారిని నీవు వెళ్ళు అని అడిగితే?

అల్లా అయితే, ఎందుకు పిలిచావు నన్ను? అంటుంది అది. అంటే బుద్ధితక్కువై పిలిచాను. ఇదిగో చెంపలు వేసుకొంటున్నాను. ఇంక ఎప్పుడూ యిల్లాంటి పిచ్చిపని

చేయును. ఈ తభాకు క్షమించు ఓ శాకినీ, ఢాకినీ అని, ప్రార్థన చేద్దామని అనిపించింది.

అప్పటికీ పోకపోతేనో ! పోకపోతే నరసింహస్వామిని ప్రార్థనచేస్తినా, అది తప్పక పారిపోతుంది. నరసింహస్వామి పేరు చెప్పినా, ఆంజనేయ స్వామి పేరు చెప్పినా దయ్యాలు పారి పోతయ్యి. ఆ విషయంలో సందేహం ఏమీలేదు నాకు.

అయితే అల్లాగ చేస్తే, ఇందాకటి నుంచి నేను అను కున్న దంతా హూష్ కాకీ అయిపోతుంది. రానున్న సంప దను వదులుకోటం అవుతుంది. హస్తగతమైన అమృతపూర్ణ కలశాన్ని బోరగించినట్లు అవుతుంది. నిన్ను, నిన్ను, అని వలచి వచ్చిన సకల ప్రాభవ సమలంకృతమైన లక్ష్మీదేవిని గృహ కవాటమునుంచి తరిమివేసినట్లు అవుతుంది. క్రకచ ధారాభ కఠోరదంష్ట్రా భయంకరాట్టహాస ముద్రిత వికృత రూపమైన దరిద్రదేవతను రా రమ్మని ఆహ్వానించి నట్లు అవుతుంది.

కాబట్టి, ధైర్యాన్ని చిక్కబట్టి, నిలవనొక్కుకొని ఆ దయ్యం సంగతి ఏమిటో ఏం జేస్తుందో, ఇంబకలే ఇస్తుందో, బంగారమే ఇస్తుందో కనుక్కోవాలిగాని, పిరికి పందనై, భీరువునై, వెంగలినై, వెర్రినై, వెధవనై, మందమతినై, గాభరాపడి, గబ్బేలుపడి ఇల్లాగ తెలివి తక్కువ దద్దమ్మతో ప్రవర్తించరాదు. చూద్దాం ! మరేమి ప్రమాదం లేదు.

దయ్యం సంగతి చూద్దాం. దానివలన మరీ చికాకుగా ఉంటే అప్పుడే ఏదో ఉపాయం ఆలోచించవచ్చు. అని నాకు నేను బాగా ధైర్యం చెప్పుకొన్నాను.

ఈ నిశ్చయానికి వచ్చిన తరువాత మనస్సుకు శాంతి కలిగి నిద్రపట్టింది. మంచి స్వప్నం వచ్చింది. కలలో కొన్ని విషయాలు చూస్తే శుభం, మరికొన్నిటిని చూస్తే అశుభం అని పెద్దలు అంటారు. నేను ఆరోజున కలలో చూచిన వన్నీ, శుభప్రదమైనవే.

నిద్ర మెళకువ వచ్చేసరికి తెల్లవారుతూ ఉంది. మంచమీదినుంచి, గభాలున లేచి వీధిలోకి పరుగెత్తాను దయ్యం ఆరాత్రి వచ్చి ఏంజేసిందో,ఏదైనా తెచ్చి పడేసిందో లేదో చూద్దామన్న ఆదుర్దాతో ముందు గేటు దగ్గరకు వెళ్ళాను.

గేటు దగ్గర ఉత్తరం ముక్క పెట్టింది పెట్టినట్టేఉంది. ఎవరో దాన్ని బొటనవ్రేలితో తాకినట్లు గుర్తు మాత్రం ఒకటి కనిపిస్తూ ఉంది. ఆ తెల్లకాయితంపైన స్పష్టంగా. రాత్రి అది అంటే ఆ దయ్యంగారు దాన్ని ముట్టుకొని ఉంటారు చదవటానికి. నిజంగా ఆమె వచ్చిందన్నమాట !

వచ్చి ? ? ?

ఏదో గాబరా పుట్టింది. ఇంటి ప్రక్కనున్న ఖాళీస్థలం దగ్గరకు వెళ్ళాను. అక్కడేమీ లేదు ! రెండో ప్రక్కనున్న

ఖాళీ స్థలంలోకి వెళ్ళాను. అక్కడా ఏమీ లేదు ! ఇంటిముం దున్న స్థలాన్నంతా చూపులతో గాలించి చూశాను.

ఆహా, ఏమీ కనుపించ లేదు ! ! నిరుత్సాహం నా హృదయం లోకి తొంగిచూచింది. నిలబడి పోయాను. నిలబడి ఆలోచించాను. ఇంతకూ ఆదయ్యం రానట్టా, వచ్చి కోపంతో వెళ్ళిపోయినట్టా అని ? రాకపోయిన పక్షంలో గేటు తలుపులో. తెల్ల కాయితం మీాద ఉన్న బొటన వ్రేలి ముద్రసంగతి ఏమిటి ? కాబట్టి వచ్చే ఉంటుంది. వస్తే ఏమీా తీసుకురానట్టేనా అని అనుకుంటూ ఉండంగానే ఇంకా దొడ్లోకి వెళ్ళిచూడ లేదన్న సంగతి చప్పున జ్ఞాపకానికి వచ్చింది. అక్కడికి వెంటనే పరుగెత్తాను. ఏమీా ఉండదు అనే నమ్మకంతోనే.

అరె ! నిజంగా విచిత్రం ! !

దొడ్లో, మధ్యగా ఇటుక రాళ్ళకుప్ప ! !

నాకళ్ళు నేను నమ్మలేక పోయినాను. భయము, భ్రాంతి, విభ్రమము, విస్మయము.

ఇవన్నీ కలిసి ఒకసారె, నాశరీరంలో సుళ్ళుతిరిగినై. ఆశ్చర్యచకితుడ్ని అయి ఆపాదమస్తకం ఆకంపించి నిశ్చేష్ట కాష్ఠాకృతి తాల్చాను.

౪

దయ్యాలు నిజంగా ఉన్నాయన్న మాట ! అందులో కొన్ని ఊరకంగా ఉపకారం చేస్తయ్యన్న విషయంకూడా నిర్ధారణ అయిపోయింది.

ఇంతకూ భగవంతుడికి నాయందు కృపగలిగింది. మా పానకాల రాయుడికి నాయందు దయవచ్చింది. మా నర సింహ మూర్తికి, "రెండవసాటి దైవమిక లేదనుచున్, గడకట్టి, భేరికా దాండ దదాండ దాండ, నినదంబులు, అజాండము నిండ మత్తవేదండము నెక్కి చాటెదను"—అని మనస్సులో అనుకొని పొంగిపోయాను.

మళ్ళీ ఒకసారి ఇటుక కుప్పవంక చూశాను. అరుణ కాంతిలో, అవి ఎర్రగా మెరసి పోతున్నవి. వాటిని ముట్టు కొని చూశాను అవి నిజమైనరాళ్ళా లేకపోతే ఏమైన మాయరాళ్ళా అని, అవి నిజమైన ఇటుకరాళ్ళు, అందులో ఏమీ మాయలేదు.

ఇహ ఎందుకూ ఊరికే సందేహాలు పెట్టుకోటం. నాకు మంచి రోజులు వచ్చినై. బాగుపడేగీత బైటపడ్డది. అంతే.

లోపలికి పోయి పానకాలరాయుడి పటానికి ఎదురుగా నుంచుని "ప్రభూ కృతజ్ఞుణ్ణి. నీపాదారవిందములను నిరంత రమూ పూజించే ఈ భక్తుడ్ని కరుణించు. శూన్యంలో నుంచి ఘన పదార్థాన్ని సృష్టించే శక్తి ఈ దయ్యానికి

ఇచ్చావు! బంగారాన్ని సృష్టించేశక్తి కూడా ఇస్తివా ఇక నాకు కోరతగింది ఏదీ వుండదు. ప్రభూ దయచూపు—అని ప్రార్థనచేశాను.

ఇక నాకేమీతోచలేదు ఇల్లు తాళంవేసి ఊళ్ళోకి వెళ్ళాను. ఇంట్లో ఉంటానికి ఏదో భయంకూడా వేసింది.

ఇప్పుడు కర్తవ్యం ఏమిటో అని తీవ్రంగా ఆలోచించాను. ఈ దయ్యం బంగారం తెచ్చి యిస్తుందా యిక ముందైనా! ఇవ్వదని తోచింది. ఇచ్చేదైతే ఇవ్వాళేఇచ్చేది. ఇది యిటుకలు చేసే దయ్యం అయి ఉంటుంది. దీన్ని యింకొకటి అడగటం బాగుండదు. అడిగినా యివ్వదు.

పచారు దుకాణాలలో పండ్లు అమ్మరు. పండ్లదుకాణంలో ఇంగువ అడిగినా దొరకదు. ఎవడి సరుకు వాడు ఇస్తాడు. కాబట్టి ఈ దయ్యాన్ని ఇంకో వస్తువ అడగటం తెలివి తక్కువ తప్ప మరోటికాదుఅన్న నిశ్చయానికి వచ్చాను.

ఇటుకమటుకు ఇల్లాగ రోజుకు నాలుగువందలు ఇస్తుంటే చాలదూ? కొద్దిరోజులలో లక్షలులక్షలు అవుతుంది. మనకు కావలసింది ఉంచుకొని మిగిలింది అమ్మి, సున్నం, కలపా అవీ కొనుక్కొని మేడఒకటి వేయవచ్చు, ఇల్లాగఅనుకొంటూ వీధిలో ఉన్న మేడల వంకచూస్తూ నడిచివెళ్ళాను.

ఇల్లాగ అమ్మితే ఎంతకాలంలో ఎంతసొమ్ము వస్తుందీ అనిగాని, ఎంతకాలంలో లక్షాధికారిని అవుతాను అనిగానీ, నేను లెక్క వేయలేదు. అల్లాంటి ఊహాలే రానియ్యలేదు.

అల్లాగ చేయటం చాలా తెలివి తక్కువా అనవసర మునూ!! గాలిమేడలు కట్టటం నా తత్వంగాదు. నెమ్మదిగా, తాపీగా, కూర్చుని ఆలోచించటమే నా స్వభావం.

ఆ వెళ్ళటం వెళ్ళటం నేను హోటలుకే వెళ్ళి, భోజనం చేసి, సరిగ్గా ఇంటికే వచ్చేశాను. జరిగిన విషయం అంతా తల్చుకొంటే చాలా తమాషాగా ఉంది. వల్లు ఝుల్లుమంటున్నది.

ఒక్క విషయం ఏమిటంటే హఠాత్తుగా వచ్చిన ఈ సంపద నన్నేమీ తలక్రిందు చేయలేదు. లాటరీలో లక్ష రూపాయలు వచ్చినైయని విని వెంటనే వెనక్కు విరుచుకు పడిపోయిన వాడిలాగు ప్రవర్తించలేదు. కొంత మందికి పిచ్చెత్తటంకూడా కద్దు. నాకు అల్లాంటి దేమీ జరగలేదు. మనః స్థైర్యము నిలబెట్టుకో గలిగాను.

చివరకు ఎన్ని రోజుల్లో ఎంత ఇటుక మన ఆధీనం లోకి వస్తుంది అన్న ఆలోచనలోకి అయినా దిగలేదు. ఎందుకూ? రేపు ఏమౌతుందో! రేపు అది ఇటుక తెస్తుందో తేనే తేదో!

ఇల్లా అనుకుంటూ ఉండంగానే మరో ఆలోచన వచ్చింది, దయ్యాలు తెచ్చే వస్తువులు నిజమైనవి కావనీ

నిజమైన వానిలాగే కనపడి ఉన్నాన మాయమౌతాయని. ఈ ఆలోచన రావటంతోనే నేను దొడ్లోకి పరుగెత్తుకొని వెళ్ళాను. ఆ ఇటుకలు ఏమైనా మాయమైపోయినాయేమో చూద్దామని. లేదు. ఆ ఇటుకలు కుప్పగా అక్కడే ఉన్నవి. మధ్యాహ్నపు ఎండలో అవి మెరుస్తూ అల్లాగే ఉన్నాయి.

ఇది చాలా తమాషాఅయిన విషయము మటుకు అవును. మనకు ఏ విషయమువల్లనైనా సంతోషం గలిగి నప్పుడు దాన్ని గురించి స్నేహితులతో చెప్పితే, వాళ్లు మన లను వీపుచరిచి "అదృష్టవంతుడివిపో!" అని అనటంవల్ల కొంత తృప్తి ఆనందం కలుగుతుంది. మనకు కలిగిన సంతో షాన్ని ఇతరులకు కాస్త పంచి ఇయ్యకపోతే మనకేదో బాధగాకూడా ఉంటుంది. ఈ విచిత్రానుభవాన్ని గూర్చి ఎవరితోనైనా చెప్పాలని అనిపించింది కాని దానివలన కొత్తచిక్కులు వస్తాయి అని తోచి నాసంతోషాన్ని నా కడుపులోనే పెట్టుకొని ఊరుకొన్నాను. ఒకటి—రెండు—మూడు రోజులు గడిచినై. ఆ దయ్యం రోజుకు నాలుగువందలని లెక్కప్రకారం తేవటంలేదు. రెండోరోజున సుమారు రెండు మూడువేల ఇటుక పడేసింది !! మూడోరోజున పదివేలు దాకా పడేసింది ! ఇల్లాగ రోజురోజు ఎక్కువ చేస్తున్నట్లు కనిపించింది. దొడ్డి నిండిపోయింది. ఇహ అక్కడ చోటులేదు,

౫

ఇప్పుడో కొత్త సమస్య వచ్చిపడ్డది. ఉన్న ఇటికలను ఏదోవిధంగా ఉపయోగపరచాలె. లేకపోతే, ఇక వచ్చే సరుకుకు చోటులేదు. ఈ ఇటుకను అమ్మన్నా అమ్మాలే, లేకపోతే మరోవిధంగానైనా వినియోగించాలె.

అప్పటికి మా ఆవిడ వెళ్ళి అయిదురోజులైంది. ఇక అయిదారు రోజులలో వచ్చేస్తుంది. ఆవిడ వచ్చేసరికి దొడ్లో ఒక ఔట్ హౌస్ కట్టించి ఉంచితే! భలే ఆశ్చర్యపోతుంది చాలా మెచ్చుకుంటుంది.

ఇదివరలో నేను డబ్బుసరిగా వాడటం లేదనీ, దుబా రాగా ఖర్చు చేస్తున్నాననీ, గునుస్తూ ఉండేది. ఇల్లాగ చేస్తే ఆనందిస్తుంది. ఇదంతా నా స్వంత డబ్బు పెట్టి కట్టించాననే చెప్పేస్తాను! నాయందు ఆమెకు చాలా మంచి అభిప్రాయం కలగడమేకాకుండా, నేను ఏదో రహస్యంగా డబ్బు నిలువ జేస్తున్నానని కూడా అనుకోవచ్చు. అల్లా అనుకోటమే మంచిది.

అయితే రోజూ ఇల్లాగ ఇటుక వచ్చి పడటం జూచి ఇదేమిటని అడగదా, అప్పుడన్నా తెలియదా ఇది నాస్వంత ప్రయోజకత్వం కాదనీ, అని తోచింది. కాని దానికో ఎత్తు ఎత్తి ఉంచాను.

ఇటుక వ్యాపారం చేస్తున్నానూ అని ఆవిడతో చెబు దామని.

పాపం ఆవిడకు మెడలోకి ఓ గొలుసు మటుకు తప్ప కుండా కొని యివ్వాలె. ఎన్నాళ్ళ బట్టో అడుగుతున్నది.

ఈ ఇటిక ఔట్‌హౌస్ కట్టటానికి వినియోగించినా మళ్ళీ నాలుగు రోజులలో పది పన్నెండు వేల ఇటుక తయారు అవుతుంది. వెయ్యి ఇరవై రూపాయలకే ఇచ్చినా ఓ రెండు వందలఏభై రూపాయలు సులువుగా వస్తాయి. ఓ అయిదు నవరసుల గొలుసు! ప్రస్తుతం అదిచాలు. అంతగా అయితే ఇంకో నాలుగు నెలలు పోయిన తరువాత పసిడానిమాట ఆలోచించ వచ్చు. ఇల్లాగే అనుకొన్నాను.

ఇంతకూ ఆ వున్న ఇటికతో వెనకను ఓ ఇల్లు వేద్దామనే నిశ్చయించాను. మూడుగదులుగా ఉండాలనుకొన్నాను. చదువుకొనేందుకు ప్రత్యేకంగా మాకు ఒక్కొక్కరికి ఒక్కొక్కగది కావాలని మొగపిల్లలు చాలా రోజులనుంచి గోల పెడుతున్నారు. వాళ్లు హాలులోనూ వంటింట్లోనూ కూర్చుని చదువుకొంటున్నారు పాపం! ఒక్కొక్కడికి ఒక్కొక్కగది ఇద్దామని నాకూ సరదాగలిగింది. ఎవరి గదిలో వాడు తన పుస్తకాలూ, బట్టలూ, పెట్టెలూ, పెట్టుకొని హాయిగా చదువుకొంటాడు. మిగిలిన గది ముగ్గురు ఆడపిల్లలకూ ఉమ్మడిగా ఉంటుంది. భగవంతుడి దయఉంటే వాళ్ళకు కూడా మూడు గదులు కట్టించాలనే ఉంది. అది ఇప్పటి మాటగాదు.

ఈ రోజుల్లో ఇల్లు వేసే విషయంలో మనదగ్గర ఇటుక మాత్రం ఉన్నది కాని సున్నమూ, కలపా, వెంటనేకొనాలె. మేస్త్రీలకూ, కూలీలకు ఇయ్యటానికి కొంత డబ్బు చేతిలోను ఉండాలె. సున్నం అయిదారు బండ్లు అప్పుమీద తేగలనూ, పరవా లేదూ అనుకొన్నాను. కలపమటుకు క్యాష్ ఇచ్చి కొనాలె. మిగతావాటికి దాని తరువాత చూచుకోవచ్చు.

కలప కొంటానికి మటుకు క్యాష్ ఎల్లాగా అని ఆలోచించాను. ఈ ఆలోచన ఎంతోసేపు పట్టలేదు. బ్యాంకిలో అప్పు తీసుకొందామని వెంటనే నిశ్చయించేశాను. తరువాత నాలుగు రోజులలో ఇటుక అమ్మి ఎట్లాగూ అప్పు తీర్చి పారేస్తాను. కాబట్టి అప్పు చేయటంవల్ల వచ్చినపెద్ద ఇబ్బంది ఏమీలేదు అని కూడాతోచింది.

మా ఆవిడ వచ్చేలోపల ఇల్లు తయారైపోవాలనీ, ఆవిడ వచ్చి చూచి ఆశ్చర్యపడి "అరె! ఎప్పుడు కట్టించారండీ? ఎంత అందంగా ఉందండి? డబ్బు ఎక్కడదండీ అప్పు జేయలేదుగద?" అని అంటూఉంటే "అప్పులేదూ, ఏమీ లేదు. ఏదో డబ్బు క్యాష్‌రూపంగా ఉంచుకోటం మంచిది గాదు. ఈ యుద్ధపురోజుల్లో, అని కొంతమంది స్నేహితులు అంటే, సరే, ఎందుకు వచ్చిన గోల అని ఇల్లాగ చేసేశాను"—అని దర్జాగా తమాషాగా నిర్లక్ష్యంగా నేను అందామనీ, నిశ్చయించుకొన్నాను. "ఇన్నాళ్ళబట్టి చెప్పారు

కారేమండీ! నిలువజేశారన్నమాట! డబ్బులేదూ, అంటూ ఉంటే తెలిసికొక్కవదాన్ని మీరు పొదుపు చేస్తున్నారను కొన్నా! అమ్మ ఎంత దొంగండీ మీరు! పోనీలెండీ మంచి పనిచేశారు. పిల్లలకు కాస్త ఆస్తి ఏర్పడుతుంది.'' అని ఆవిడ తప్పకుండా అంటుంది

కాబట్టి ఇల్లు తత్‌క్షణం తయారుచేసి ఇల్లాంటి సరదా మాటలు వింటామనుకొన్నాను. ఆ మధ్యాహ్నమే బ్యాంకీకి వెళ్ళి నూరురూపాయలు అప్పుపుచ్చుకొన్నాను. మనవూళ్లో అడితీల్లో కొనేకంటె గుడ్లవల్లేరు రేవులో కొంటే, కఱ్ఱ చాలా చౌక? అంతేకాక మంచిదికూడా దొరుకుతుంది. అందుకని డబ్బు జేబులో వేసుకొని గుడ్లవల్లేరుకు కారు ఎక్కాను.

గుడ్లవల్లేరులో నేను ఆట్టేసేపు ఉండలేదు. గిల్లిబేరం చేయటం నా స్వభావమూకాదు. మంచి టేకుకఱ్ఱ కావల సింది బేరంచేసి, ఇంటికి పంపమనిచెప్పి, యాభైరూపాయలు అడ్వాన్సు ఇచ్చి మిగతా యాభై ఇంటిదగ్గర ఇస్తానని చెప్పి వచ్చేశాను.

నేను ఊళ్లోకి రావడం ఏడుగంటలకే వచ్చినా, కాఫీ హోటలులోనూ, అక్కడా కాసేపు గడిపి, భోజనంచేసి రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతాన ఇంటిదారి పట్టాను. ప్రొద్దున వెళ్ళటం అదే రావటం.

౬

నేను మా యింటికి ఓ ఫర్లాంగుదూరంలో ఉండం గానే మా ఇంట్లో ఓ దీపం వెలుగు కనిపించింది. ఏమిటా అని చూశాను. కిటికీలోనుంచి స్పష్టంగా దీపపు వెలుగు కనిపిస్తున్నది. దీని దుంప తెగ ఆ దయ్యం ఇంట్లో ప్రవేశించి ఇల్లంతా చూస్తున్నదిరా అనిపించిది. గుండె బద్దలై పోయింది మెల్లగా నడిచివెళ్ళాను. ఇంటిముందు ఒకనిమిషం నిలబడి చూశాను. ఇంట్లో ఎవరో మెదులుతున్నట్లుకూడా అలికిడి అయింది. ఇంతలో చప్పునజ్ఞాపకంవచ్చింది మాఆవిడీ వచ్చి వుంటుందీఅని. నా తెలివి తక్కువకునవ్వుకొని గబగబా లోపలికి వెళ్ళాను—"ఎప్పు డొచ్చావ్! ముందుగా ఉత్తరమైనా వ్రాయలేదేం ?" అంటూ, ప్రొద్దునే ఆరుగంటల బండికే వచ్చాము. అయ్యగారు ఇంట్లోలేరు. నాదగ్గరకూడా తాళం చెవి ఒకటి ఉండబట్టి సరిపోయిందికాని లేకపోతే ఇప్పటిదాకా చలిలో బయటఉండాలిసివచ్చేది! ఎక్కడికి వెళ్లారూ అన్నది.

"నేను ఎక్కడికి వెళ్ళిందీని చెప్పటానికి ముందు నీకు చెప్పవలసినసంగతులు చాలాఉన్నవి. నీభోజనం అయిందా? పిల్లలు అప్పుడే పడుకొని నిద్రపోతున్నారే?'-అన్నాను.

ప్రయాణం బడలికవల్ల నిద్రవస్తుంటే అన్నం వండి పిల్లలకుపెట్టి ఆకలైతే నేనూ తినేశాను. మీ భోజనం మాట ఏమిటి ?

"నేను భోజనం చేసివచ్చాను. హోటల్లో" అన్నాను. ఆ తరువాత ఒక అరగంటలో కాంతం ఇల్లంతా సర్దుకొని వచ్చి నా ప్రక్కనున్న మంచంపైని నడుమువాల్చి "ఏమిటి సంగతులు చెప్పండీ-చాలా సంగతులు ఉన్నాయి అన్నారూ" అన్నది.

౭

ఇప్పుడు నేను ఈ దయ్యం ఇటుకలు తేవటం సంగతి అంతా చెప్పాల్యాలా, వద్దా అని ఆలోచించాను. చెప్పేస్తే ఇల్లు కట్టటంలో స్వప్రయోజకత్వం ఏమీలేకుండాపోతుంది. కాబట్టి ఆ విషయం దాచేసెయ్యాలె. అసలు నేను వేసుకొన్న ప్లాను సగం పాడైపోయింది. దొడ్లో క్రొత్తయిల్లు వేసి ఆమెకు చూపిద్దామనుకొన్నాను. కాని ఆమె నాలుగైదురోజులు ముందుగా రావటంవల్ల నేను అనుకొన్నంత ఆశ్చర్యం ఆమెకు కలుగజేయలేకపోయినాను. ఇప్పుడు అసలు సంగతి చెప్పేస్తే వ్యవహారం బొత్తుగా చప్పబడిపోతుంది. ఆ రాత్రికి ఆ విషయము బైటపెట్టవద్దనే అనుకొన్నాను.

మర్నాడు కలప వస్తుంది. పనివాళ్ళనుకూడా రమ్మని చెప్పి వచ్చాను. ఇదంతా చూచి ఆమె ఆశ్చర్యపడితే అప్పుడు చెప్పవచ్చు. అప్పుడైనా దయ్యం సాయంవల్ల ఇటుకలు వస్తున్నాయని చెప్పకూడదు. అల్లా చెపితినా సంతోషిస్తుందిగాని ఆవిడకు నామీద గౌరవం మాత్రం

కలుగదు. అసలు ఆసంగతి ఎత్తకూడదు. ఇటుక వ్యాపారం వల్ల అపారధనం గణిస్తున్నట్లు ఆమెకు అభిప్రాయం కలుగ జేయాలె.

అందుకని ఆ మెతో ఈకథ ఏమీ చెప్పలేదు. అమ్మాయి పెండ్లికి వెయ్యినూట పదహార్లు కట్నం యిచ్చి మంచి సంబంధం తెస్తానన్నాను. ఆవిడకు నాలుగైదు రోజులలో ఓ జిగినీ గొలుసో, లేకపోతే ఒక అటుకులగొలుసో, కొనిఇస్తానన్నాను. ఓ రేడియో కూడా కొనుక్కుంటే బాగుంటుందా అని అడిగాను. ఈ మాటలు విని సంతోషించటానికి బదులు మండి పడి, "చాల్లేఊరుకోండి. గొంతెమ్మకోరికలూ మీరూనూ ! అన్నీ కొనేవారిలాగే జిగినీగొలుసు కావాలా అటుకులగొలుసు కావాలా అనీ, రేడియోకొంటే బాగుంటుందా అని అడుగుతున్నారు ! అయ్యో ! అయ్యో ! మీరు గొలుసు చేయించనూ, నే పెట్టుకోనూనూ ! ! ఇంటికైన అప్పూఅట్లాగే ఉంది. ఆవగింజలో అరవీసం తీరలేదు. రేడియో కొంటారట రేడియో ! !" అని చీదరించింది, "నీకేం తెలుసు నాసంగతి కొనగల్గునో లేదో నీకే తెలుస్తుంది కొద్దిరోజుల్లో !" అని ఊరుకొన్నాను.

"నాకు తెలియనిది ఏముంది ? డబ్బు ఎక్కడినుంచి అయినా కొట్టుకురావాలె!" అన్నది ఆవిడ విసుగ్గా.

"కొట్టుకొస్తుంది చూస్తుండు" అన్నాను ధైర్యంగా. నామాటలయందు ఆవిడ ఏ మాత్రం విశ్వాసం చూపలేదు.

నాకు పట్టుచేసే ఉపాయం దొరికిందని నేనూ చెప్పలేదు ఆవిడకు !!

మర్నాడు నేను నిద్రలేచే సరికి మా ఆవిడ ఎవరి మీదనో పెద్దగా కేకలు వేస్తున్నది. ఆ కేకలవల్ల నాకు మెళకువ వచ్చింది.

"మాకు కాదయ్యా. మాకెందుకూ ఈ దూలాలూ కడ్డీలున్నూ ! ఎవరివో !" అంటూన్నది మా కాంతం. అవతలవాడు, "పంతులుగారు నిన్న కొన్నారండి" అంటూన్నాడు.

"మా పంతులుగారు కాదని చెపుతూఉంటే వినవేం ! ఎవరివో కనుక్కో- మాకు గాదు" అంటూన్నది ఈవిడ.

ఈ గోల విని నేను గబాగబా వాకిట్లోకి పరుగెత్తి కెళ్ళి "మనకేలేవే కాంతం ఊరుకో నేను కొన్నాను" అన్నాను.

"ఎందుకూ! అన్నది ఆవిడ నన్ను వెర్రివాణ్ణిలా చూస్తూ.

"నీకు తెలియదులే ఊరుకో, దొడ్లో ఒక ఔటుహౌస్ వెయ్యాలను కొన్నాను. ఇటుక తెప్పించాను. సున్నం పంపమని చెప్పివచ్చాను. పనివాళ్ళు ఇంకా కానేపటి కల్లా వచ్చి పని ప్రారంభిస్తారు" అని సంగతులన్నీ చెప్పేశాను. వడగళ్ళలాగ పడిపోయినై విశేషాలన్నీ. ఆవిడ ఆశ్చర్యపోయింది. పోక ఏంజేస్తుంది హాడలగొట్టేస్తిని ఒక్కసారి ! ఆవిడ విచిత్రంగా చూస్తూ నిలబడివుంది.

"రాత్రి అంటివే డబ్బు ఎక్కడినుంచి అయినా కొట్టు కొస్తుందా అని! యిప్పుడేమంటావ్! యిటుక ఉంది. కలప కొనేశామ్. ఎల్లుండి కల్లా యిల్లు తయార్!!" ఈమాటలు. ఆమెకు ఆశ్చర్యం కలగటానికి ఏపద్ధతిలో అనాలో ఆపద్ధతిలో అన్నాను గర్వంగా.

ఆవిడ తెల్లపోయి చూస్తూ, "ఏమిటీ! ఎంతపని జరిగిందండి! ఒక్కసారైనా అనకపోతిరేం!!" అని అడిగింది. "యిటుక నీవు యింకా చూడనేలేదూ!! రా చూపిస్తా." అంటూ ఆవిడను నెట్టుకుంటూ దొడ్లోకి తీసికెళ్ళాను.

అరె!!

ఒక్క యిటుక ముక్కైనా లేదు అక్కడ. పైగా యిదేమిటి!! శాస్త్రిగారి యింటికీ, మాయింటికీ మధ్య గోడ ఒకటి లేచింది!

నాకు నోటమాట రాలేదు. నిర్ఘాంత పోయినాను. ఎట్లా జరిగిందీ ఈ వింతా అని! ఆ దయ్యం పనా యిది? చా; ఎప్పటికీ కాదు.

అయితే ఎట్లా జరిగిందీ అని ప్రశ్న వచ్చిందికాని, ఎంతోసేపు ఆలోచించవలసిన అవసరము లేకపోయింది. ఆ శాస్త్రి చేసిన పనే యిది! కనపడుతూనేఉంది. నేను యింట్లో లేకుండా చూచి ఈ పనిచేసి ఉంటాడు! నిన్న సాయింత్రానికి యిది తయారై ఉంటుంది. వీడి దుంపతెగ ఎంత దౌర్జన్యం

చేశాడూ ! యిటుకంతా కాజేశాడే !! అని ఆలోచిస్తూ నుంచున్నాను. ఆవిడను లాక్కొచ్చిన విషయమే మరిచి పోయినాను.

"ఏమిటండీ ఆలాచూస్తారూ? ఎందుకూ ఆ గాబరా?" అని ఆవిడ అడుగుతూ ఉన్నా నేను వినిపించుకోలేదు.

ఈవిడ ప్రొద్దునే వచ్చిందికదా, యింతపని జరుగుతూ ఉంటే తెలియకుండా ఉందా ? పనివాళ్ళువచ్చి హడావుడిగా గోడకడుతూ ఉంటే ఈవిడకు తెలియకుండా ఎల్లాగవుంటుంది? తెలిసే ఉంటుంది. తెలిసినప్పుడు ఆవిడచూస్తూ ఊరుకోకపోతే అదేమిటండీ అనకూడదూ ?

అంత యిటుకా ఆయన పబ్లిక్కుగా కాజేస్తుంటే ఈమొగారు ఊరుకోటం ఏమిటి ! యిల్లాగ అనుకొని మొత్తం మీద తప్పు అంతా ఆవిడదే అయినట్లు తేల్చుకొన్నాను. ఈ నిశ్చయానికి వచ్చేసరికి ఒక్కనిమిషం పట్టింది. ఇంతలో నూకాంతం నాదగ్గరకొచ్చి మీదచెయ్యివేసి "ఏమిటి అల్లాగ చూస్తున్నారూ?" అని అడిగింది! నాకు వళ్ళు మండిపోయింది ఆవిడ యిల్లాగ ఏమీ తెలియని నంగనాచిలాగ అడగడం చూస్తే !

"యహా ఉండు మహా తెలియనిదానిలాగ అడుగుతావు ?" అని అంటూ ఆవిడ చెయ్యి విదిలించి వేశాను.

"ఏమిటండీ తెలియటం ?"

"ప్రొద్దున ఇక్కడ ఇటిక ఉందా ?"

"ఆ"

"అదంతా ఏమైంది ?"

"ఏమైందో కనపడటం లేదండీ గోడ కట్టించా డాయన ?"

"గోడ కట్టిస్తూ ఉంటే నీవు చూస్తూ కూర్చున్నావు కాబోలు ?"

"చూడక ఎం జేయమంటారండీ ?"

"ఆ మాత్రం తెలియదూ ? ఇంట్లో నేను లేకుండా జూచి ఇటికఅంతా ఆయన కాజేస్తుంటే నోరు తెరుచుకు చూస్తూన్నావూ, ఇంటి కైనదానివి ? వద్దని అనటం తెలియ దేం ?"

"అదేమిటండీ అల్లా అంటారు ? ఆయన సొమ్ము ఆయన వాడుకొంటూ ఉంటే నేను వద్దు అనటం ఏంబాగుం టుందండీ."

"ఆయన సొమ్మా ? ఇటుక అంతా తనదే అన్నాడు కామాలు ! నీవు నమ్మావు ! తెలివితక్కువ దద్దమ్మవు ! ఆయన అంటేమటుకు ఒకవేళ మనదేమో, యింటాయన తెప్పించారేమోనని అనుకోవద్దూ ?"

"అయ్యో కర్మమా అదేమిటండీ అల్లాకోప్పడతారూ? వాళ్ళు మన నోట్లో ఇటుక వేసుకొంటామని నాకు ముందు

గానే చెప్పారూ! నేను వెళ్ళే రోజునే జానికమ్మగారు నన్ను అడిగింది. మా ఇటుక బండ్లు వస్తుయ్యావన్నా. మా దొడ్డి బొత్తిగా చిన్నది. స్థలం లేదు. మీ దొడ్లో వేస్తామని. పోనీ ఏం భాగ్యం వేసుకోండి అన్నాను. ఇవ్వాళ ప్రొద్దునే శాస్త్రి గారు పనివాళ్ళను పిలిపించి గోడ పూర్తి చేయించాడు. కొద్దిగా మిగిలిన ఇటుక వాండ్లు దొడ్లో ఒకమూల వేసుకొన్నారు. ఆయనేమిటి ? మీ ఇటుక కాజేయటం ఏమిటీ ? నాకేం అర్థం కావటంలేదు!''

ఈ మాటలు వినేసరికి, ఆకాశం విరిగి మీద పడ్డట్లు అయింది. నా తలతిరిగి పోయింది. ఈ ఇటికంతా మా దొడ్లోకి ఇల్లాగ వచ్చిందని నా కేమి తెలుసూ!

ఆ శాస్త్రిగారు ఇటుక తోలించుకొంటున్నారు అని నాకు ముందుగా తెలిస్తే, ఇంత కథ జరగకుండా ఉండేది. ఇప్పుడెల్లా కలప వచ్చి కూర్చున్నదాయె! పనివాళ్లూ వస్తూ ఉంటారు బహుశ! సున్నంకూడా పంపమని చెప్పితిని!! అంచేత చాలా కోపం వచ్చింది కాని ఎవరి మీద కోప్పడాలో తెలియలేదు.

చివరకు ''నీవీ సంగతి నాతో చెప్పలేదేం ?'' అని మా ఆవిడ మీదే ఎగిరిపడ్డాను. ఆవిడ అన్నది. ''ఏమంత మహాభాగ్యమని చెప్పాలె! మరిచి పోయినాను. అదీగాక ఆ రోజే వెళ్ళిపోతిని!'' ఈ మాటలు అని ఆవిడ బిక్క ముఖంతో అక్కడే నిలబడ్డది.

నేను ఆవిడను అక్కడ వదిలేసి వాకిట్లోకి వెళ్ళాను. ఆ కలప ఏంజెయ్యాలన్న సమస్య ఒకటివచ్చింది. "ఈకలప ఎందుకు కొన్నారూ? ఇటుక మీరు కొంటే ఆయన కాజేయుట మేమిటీ!—ఏమిటో సంగతి చెప్పండి ?" అని మా ఆవిడ గొడవ. బండివాడు బాడిగ యిమ్మని గొడవ. తల తిరిగి పోతుంది. పిచ్చి ఎత్తుతున్నది.

ఇంతలో నేను గేటుకుకట్టిన ఉత్తరం క్రిందపడిఉంటే దాన్ని మా కాంతం తీసిచూచి, "ఇదేమిటండోయ్ ? నేను యింతసేపటినుండి చూడనేలేను ! ఎవరికి వ్రాసిన ఉత్తరం ఇది ?" అని ఉరిమిచూస్తూ అడిగింది.

నేను ఏం జెప్పేది ? అసలే మనస్సు నానా ఖంగాళీగా ఉందాయె. "దానికీ" అన్నాను. "దేనికీ ? దేనికండీ ఈ ఉత్తరం ? మీరు వచ్చిన దాకా కుర్చీలో కూర్చోమని రాశారు కూడా !" అని నిలవ తీసి అడిగింది నన్ను అను మానిస్తూ.



వ్యవహారం అంతా వెధవ గొడవ క్రింద తేలి పోయింది. వళ్ళు అంతా చీదర పుట్టింది. చీకాకేసింది. కోపం వచ్చింది. ఇప్పుడావిడకు ఈ ఇటుక సంగతి ఏమని చెప్పేది ? నేనే తెప్పించాను. ఆయన కాజేశాడు అని నిలబడితే పెద్ద పోట్లాటా, సాక్ష్యాలూ వస్తాయి. అసలు నిజానికి ఇటికేమో

ఆయన తోలించుకుంటే, ఇది నాది అని నేననుకొంటిని ఈ దయ్యపు గొడవలో పడి ! ! ఈ ఉత్తరం ఎవరికి వ్రాశానని చెప్పేది. ఈఘండాలపు చిక్కుల్లోపడి తల గోక్కుంటూ నుంచున్నాను.

"ఏమండీ ఏమిటీ గొడవ అంతానూ? ఇటుక ఆయనదే అని నేను అనుకొన్నాను, వాళ్ళు ముందుగా నాతో చెప్పారు కాబట్టి! మనదా ఏమిటండీ? మనదైతే ఆయన అంతధైర్యంగా అన్ని వేల ఇటుక ఎల్లా కాజేస్తాడండీ ? మీరు ఎవరికి డబ్బు ఇచ్చారూ మనకి ఇటికతోలమనీ? భద్రయ్యకేనా! ఏమాత్రం యిచ్చారూ ? ఓ పాతికైనా యిచ్చి ఉంటారు ! పాతికేం, యాభై యిచ్చి ఉంటారు ! అంతేనా ?" అని ఊరికే ఆవిడ అడుగుతూఉంటే నేను ఏమీ మాట్లాడలేదు. పట్టుబడ్డ దొంగలాగ నుంచుని ఊరుకొన్నాను. ఆవిడకు మరీ అనుమానం కలిగింది.

మళ్ళీ యిల్లాగ అన్నది ఆవిడ, "సరే, యింకెందుకూ; తెలిసింది. భద్రయ్యకేమో యాభై రూపాయలు యిస్తే వాడు కాజేసి ఊరుకొన్నాడు. మీరేమో యిదంతా భద్రయ్యతోలిన యిటుకే అనుకున్నారు. అంతే గదండి ఏమాత్రం తగలేశారు చెప్పరేం ?

నేను మాట్లాడక ఊరుకున్నాను. నేను ఊరుకొంటే ఆవిడ ఊరుకొంటుందా ? లేదు. ఈ వుత్తరం ఎవరికండీ వ్రాసింది?

మహాశయా అని వ్రాశారు. ఎవరు ఈ మహాశయి ? ఏమి పనండీ యిది నేను ఉళ్లో లేకుండాజూచి ! ! అని అడుగుతుంటే గుండెల్లో గుద్దినట్లు అయింది.

ఇహ ఎందుకొచ్చిన గోల అని, దయ్యపు సంగతి అంతా, ఆస్థితిలో చెప్పగలిగినంత ఓపికగా, టూకీగా చెప్పాను.

చెపితే ఏంలాభం ! "నే నంత తెలివి తక్కువ దద్దమ్మను కానండోయ్ ! దయ్యానికి ఎవరైనా ఉత్తరం వ్రాస్తారా ? ఎక్కడైనా విన్నామా యిల్లాంటి సంగతి ! యిహ ఊరుకోండి" అని గట్టిగా అని, ఆ ఉత్తరం అక్కడ విసిరి పారేసి చురచురాచూస్తూ వెళ్ళిపోయింది. నేను ఆ ఉత్తరాన్ని చేత్తో పట్టుకొని ఆ కొత్తగా గట్టిన గోడవంక చూస్తూ, దిగాలపడి నిలబడి పోయాను.



# బాకీ

## ౧

"నామాట వింటే ఇంతవరకు రాదు అన్నయ్యా! ఆవచ్చిన అర్గన్లె నాచేతులో పడేస్తే, కానీ అప్పు లేకుండా జరుపుతాను అంటే వింటేనా ఆయన!"

"నేను చెప్పా నమ్మా! నీకు వచ్చిన జీతం అమ్మాయికి ఇచ్చేయరా; ఆడవాళ్ళు మనకంటే పొదుపుగా వాడుతారూ అని చెప్పానమ్మా?"

"మీరే కాదు అన్నయ్యా! అంతా చెప్పారు. వింటేనా? చూస్తున్నారుగా సంగతి అంతా! బియ్యంవాడికి యాభై రూపాయలు ఇవ్వాలి. ప్రొద్దున్నె ఆయన వచ్చి కేక వేసి వెళ్ళాడు. నేను వంటఇంట్లో ఉన్నాను అప్పుడు చెయ్యి ఊరుకోలేదు. లేకపోతే వచ్చి, అప్పు పెట్టినందుకు ఆయనను నాలుగు చీవాట్లు వేసేదాన్ని."

"వాడ్ని చీవాట్లు వేస్తే ఏంలాభం అమ్మాయీ! మన బంగారం మంచిది కాకపోతే కంసాలి ఏం జేస్తాడూ!"

"బాగా అన్నారు! ఇల్లాగ వళ్ళూ పై తెలియ కుండా కర్చు చేస్తే ఎన్నాళ్ళని గడుస్తుందంటారూ!"

"నిజమే మరి"

"నిజ మని మెల్లిగా అంటారేమిటి? ప్రస్తుతం మీరూ మేమూ కలిసిఉన్నాము కాబట్టి ఏమన్నా, ఏమున్నా ఏం లేక

పోయినా, ఇబ్బంది అంటూ కనబడటం లేదు ? రేపు వేరుకు కాపురం పెడితే తెలిసొస్తుంది అయ్యగారికి !'' అన్నది మా బావమరది భార్య విసుగుతో.

''ఎల్లకాలం ఇల్లాగే ఎందుకుంటుం దమ్మా! ఏదో చిన్నతనం ఇంకా నాలుగేండ్లు గడిస్తే వాడికే వస్తుంది జ్ఞానం !'' అన్నాను నేను.

నిజానికి వాడిని గట్టిగా చీవాట్లు వేయటానికీ వీలు లేదు. అరవై రూపాయలు వస్తున్నాయి రావటానికి. కాని అందులో నెలకు ఓ ఇరవై రూపాయలు ఇంటి దగ్గరున్న తల్లి తండ్రులకు పంపుతున్నాడు మొగుడూ పెళ్ళానికీ మిగిలిన నలభై సరిపోవలసిందే. కాని—ఏదో చిన్నతనంచేత బట్టలకూ, వాటికీ, కాస్త ఎక్కువే కర్చు చేస్తున్నాడు. సంవత్సరానికి రెండువందల రూపాయలు వచ్చే సదుపాయం ఉందికదా, అప్పు కాస్త అయితే మట్టుకు ఏమి. తీర్చుకో లేకపోతాడా అని నేనూ ఊరుకున్నాను. ఎప్పుడో వచ్చి నప్పుడు ఇస్తానంటే వర్తకులు ఊరుకోరు. అందుచేత అంత వరకూ ఆగటానికి వీలులేదంటూ బియ్యపువర్తకుడు మా వాడిని వేధిస్తూఉన్నాడు. దానితరువాత తీసుకోవచ్చు వాడికి సమయానికి కాస్త సహాయపడదామని నేను అనుకోటం అయితే అనుకొంటాను. కాని అనుకోటంతోనే సరి! ఇద్దామంటే ఉండేదికాదు. వందరూపాయలు తెచ్చుకొంటున్నా నాసంగతి అంతకంటే అద్ధాన్నం. వాడికింకా కాస్త అప్పు అయినా పుడుతుంది. నాకు అదీ లేదు. అయితే నాది పెద్ద

సంసారం. పిల్లల చదువులకూ వాటికీ ఖర్చులున్నాయి. వాడికి ఏ శాదరబందీ లేదు. వాడు కాస్తో, కూస్తో, వెనకేయవచ్చు అందుకని ఈతఖా వాడికి శాస్త్ర గట్టిగా చెప్పాలనే అనుకొన్నాను.

ఆరోజు మధ్యాహ్నం భోజనాలైన తరువాత మావాడితో ఈ ప్రసంగం ఎత్తి. అప్పులవాళ్ళు మన ఇంటిచుట్టూ తిరగటం మన కేమీ మర్యాదగా లేదురా నాయనా! నీవు ఎక్కడైనా తెచ్చి అయినా సరే ఆ బియ్యంబాకీ తీర్చి వేసెయ్యి అని కోప్పడ్డాను.

"నిజమే బావా! దరిద్రంగానే ఉంది. వారం రోజులలో ఈ బాకీ తీర్చేస్తాను" అన్నాడు. తీర్చే సెయ్యి. తీర్చి ఇకమీదట, నీకు వచ్చే జీతం, జీతం అమ్మాయికి ఇస్తుండు. ఆడవాళ్లు వాడినంత పొదుపుగా మనం వాడలేము అన్నాను. అమ్మాయి వింటూఉండంగానే. వాడు భార్యవంక చూచి ముసిముసినవ్వులు నవ్వుతూ "అల్లాగే బావా, నీవు ఇంతగా చెప్పనక్కర లేదు, తప్పకుండా అల్లాగే ఇస్తాను" అన్నాడు. వాడిభార్య "ఆ అన్నీ ఇచ్చారు! ఎన్నిసార్లు అన్నారు ఇల్లాగ" అని ముక్కూ మూతీ విరిచింది.

౨

ఆ తరువాత రెండుగంటలకే మావాడు టీకుటాకుగా ముస్తాబై ఎక్కడికో బయలుదేరుతున్నాడు. ఎక్కడికీ అని అడగకూడ మంచిది కాదు. కాబట్టి ఊరికే సందేహంతో

నవ్వుతూ వాడివంక చూశాను. ఆ వికారపు చూపుల్లో నా ప్రశ్న బయటపడ్డది. వాడూ ఆ సంగతి గ్రహించాడు.

"ఇవ్వాళ మా బ్యాంకి అధికారి నాలుగుగంటల బండిలో వస్తాడు బావా. నేను వెళ్ళి రిసీవ్ చెయ్యాలె" అన్నాడు మావాడు.

"అయితే నాలుగుగంటల బండిలో వచ్చే ఆయనను రిసీవ్ చేయటానికి రెండు గంటలకే బయలుదేరాలా ?" అని అమ్మాయి అన్న ఈ ప్రశ్న విని వాడు పకపకా నవ్వి, దానికో కారణం ఉంది బావా అన్నాడు.

ఒకటేం రెండు ఉన్నాయి అన్నయ్యా అన్నది వాడి భార్య నవ్వుతూ. ఇద్దరూ పకపకా నవ్వుకొన్నారు. ఎందుకో నాకు అర్థం కాలేదు.

"ఏం లేదు బావా, మూడు గంటలకు ఓ టీపార్టీ ఉంది, ఆంధ్రా ఇన్సురెన్స్ హాలులో" అన్నాడు వాడు. "ఆ, ఆ. ఎందుకండీ ఆగొడవంతా ? అసలు సంగతి చెపితే ఏం ?" అన్నది వాడి భార్య.

మావాడు భార్యవంక తిరిగి, అసలు సంగతికి ఏముందీ అంటూ, ఇదిగో, ఇది చూడు బావా అని ఓ ఎర్రకాయితం నాకు అందించాడు. నేను చూచి నవ్వుకొని, నిజమే నమ్మా టీ పార్టీమాట నిజమే అన్నాను.

టీ పార్టీ మూడింటికైతే రెండింటికే బయలు దేర టానికి కారణం ఏమిటో అడుగు అన్నయ్యా! అన్నది కనకం

విరగబడి నవ్వుతూ, "అడగటం ఎందుకూ, వాడే చెబుతాడు-" అని నే నన్నాను.

చెప్పటానికి మరేం లేదు బావా, టీపార్టీ కాబట్టి ముందుగా వెళ్ళటం దేనికైనా మంచి దని వెళుతున్నాను. అంతే, అని భార్యను చూచి ముసిముసి నవ్వులు నవ్వాడు.

"అది కాదండీ అన్నయ్యా, రెండున్నరకు బియ్యపు వర్తకుడు వస్తాడు. వస్తానని చెప్పి వెళ్ళాడు లెండి. అందుకని హడలిపోయి పారిపోతున్నారు" అని నిజం కాస్తా బయట పెట్టింది.

మావాడు భార్యను కోప్పడలేదు, "హడలిపోవటం కాదు బావా వారంరోజుల్లో ఎట్లాగూ వస్తుంది. ఇచ్చేస్తాను. ఏదో ఈనాలుగు రోజులూ వాడి కళ్ళబడకుండా ఉండాలని చూస్తున్నాను. అంతే." అన్నాడు. "అయితే మట్టుకు ఇప్పుడు పారిపోవటం భయపడి కాదా?" అన్నది అమ్మాయి. వాడు మాట్లాడలేదు. అమ్మాయి ఊరుకోక "ఎందుకండీ, అంత అభిమానం ? మీ బావదగ్గర కూడాను. ఆయన వస్తున్నాడూ, ముఖం తప్పిస్తున్నానూ అని చెప్పరాదూ ?" అన్నది.

"చెప్పే దేమిటి, బావకు తెలియదా ? అది కాదు బావా, వారం రోజులలో ఇస్తానంటే వాడు ఎందుచేతనో ఆగటం లేదు. ఎప్పుడూ ఇల్లాగ కాదు. ఈతభా ఎందుచేతనో జీడిలాగ పట్టుకొని వదలకుండా ఉన్నాడు. అందుకని ఈ

నాలుగు రోజులూ వాడికి కాస్త కనపడకుండా ఉందామనే అనుకుంటున్నాను'' అన్నాడు మావాడు.

''అదా సంగతి? రెండున్నరకు ఆయన వస్తాడని ముందుగా వెళ్ళి పోతున్నావ్రా? అయితే ఒక్క సంగతి. ఆ వచ్చిన ఆయన నీవు వచ్చేటంతవరకూ ఇక్కడే కూర్చుంటాను అనకూడదు? అప్పుడేమిటి గతి?'' అన్నాను. ఇల్లా జరగవచ్చునని వాడికి అంతవరకూ తట్టలేదు కామాలు, ఈ మాట విని మా వాడు తెల్లపోయినాడు.

తెల్లపోయి, ''నిజమేను బావా! ఎట్లా వాడు అల్లా చేస్తే చెయ్యవచ్చు. ఒకతీరాన వదలటంలేదు. తీరా నేను అధికారిని వెంటబెట్టుకొని వచ్చేసరికి ఈ దరిద్రుడు తయారవుతాడు కామాలు'' అని అంటూ దిగాలపడి నుంచున్నాడు.

''ఆయనకు తోచకపోయినా నేను చెప్పి అయినాసరే కూర్చోబెట్టకపోతే చూడండి'' అని అమ్మాయి బెదిరించింది.

అమ్మాయి నవ్వులాటలకు అన్న ఈ మాట, వాడిని కష్టపెట్టింది. అందుకని వాడు విసుక్కొని ఏమీ జవాబు చెప్పలేక నావంక దీనంగా చూశాడు.

''ఏంరా, అల్లాగ దిగులుపడతావ్రా? అప్పులున్నయ్యి అని ఆయనకు తెలుస్తుంది. తెలిస్తే నీకు వచ్చిన నష్టం ఏముందీ? ఆయనకు మట్టుకు అప్పులు ఉండవా?'' అన్నాను.

"అల్లా కాదు బావా. నేను ఏదో డబ్బుగలవాడిని అయినట్లూ, ఘరానాగా బతుకు తున్నట్లూ ఆయనకు మొదట్లో అభిప్రాయం కలుగజేశాను. ఇప్పుడు ఈ విధంగా నా బతుకంతా బయటపడ్డదా నాకు మర్యాద ఉండదు!" అన్నాడు.

ఈ మాటమీద అమ్మాయి అన్నది..."అయితే మీబావ ఏం జేస్తారూ, మీరే ఉండి, ఆయనకు ఏదో మంచి మాట చెప్పి పంపించి మరీ వెళ్ళండి."

ఈ సలహా మా వాడికి నచ్చలేదు. అందుకని వాడు నాతో అన్నాడు. "అదికాదు బావా, నేను కనపడితే ఆయన వదలడు. నువ్వే ఏదో కాస్త మంచిమాట చెప్పి పంపివేయాలె." ఆ అనటంకూడా బతిమలాడే పద్ధతిలో అన్నాడు.

"సరేలే, నే నేదో చెప్పి పంపిస్తానులే. నీవు వెళ్ళు" అని మావాడ్ని పంపించాను. వాడు వెడుతూ "బావా, నీ కవిత్వం అంతా ఉపయోగించి ఈపీడ వదిలించాలె సుమీ నేను నాలుగున్నర కల్లా మా అధికారితో వస్తాను" అని చెప్పి భార్యతో, ఫలహారం కాఫీకూడా సిద్ధంచేయమని పురమాయించి వెళ్ళిపోయినాడు.

నేను కాస్సేపు పడుకొని, విశ్రాంతి తీసుకొని వాకిట్లోకి వచ్చేసరికి ఒకాయన మాయింటికి వస్తున్నాడు. అప్పుడు మూడు అయింది. ఆ వచ్చే ఆయన నల్లగా పొట్టిగా

ఉన్నాడు. బట్టలు మాసి ఉన్నాయి. మూడు కాలేదు, అప్పుడే వస్తున్నాడు. పడిపోయినట్లు అనుకొని చూస్తూ, నిలుచున్నాను. ఈ షాహుకార్లు ఎండా వానా అని చూడరు ఎప్పుడు బడితే అప్పుడు వస్తారు. నిద్రాహారాలు ఉండవు కాబోలు. ఇల్లా అనుకుంటూ అక్కడే నిల్చున్నాను.

ఆయన యకాయకీని సరిగ్గా గడపలోకివచ్చి, నన్ను తేరిపార జూచి "నారాయణమూర్తిగారు ఉన్నారాఅండి!" అని అడిగాడు. "లేరు"

ఈ మాట విని ఆయన నిలువునా నీరై పోయినాడు. ఆకాశం విరిగి మీాద పడ్డట్లు నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. అనుకున్న సమయానికి పైకం అందకపోతే కొంప కూలినట్లు నటించటం వర్తకులకు ఉండే సహజగుణమే కదా అనుకొన్నాను. తన సొమ్మంతా హఠాత్తుగా సముద్రంలోమునిగి పోయినవాడు సహితం అంత ఏడ్పుముఖం పెట్టడు. ప్రాణం మీాదికి వచ్చిన వాడిలాగ గుడ్లు తేలేశాడు. వాటర్ లూ యుద్ధంలో ఓడిపోయిన నెపోలియన్ సహితం అంత బేజారై ఉండడు. ఆయన్ను జూస్తే నాకు పరమ అసహ్యాం వేసింది.

కాస్సేపటికి ఆయన తెప్పరిల్లి 'ఎక్కడికి వెళ్లారండీ?" అని అడిగాడు. "బైటికి వెళ్ళాడండి" అన్నాను.

ఆయన ఒక్కక్షణం అల్లాగేనిలబడి చివరకు "ఎక్కడకు వెళ్ళి ఉంటాడండి? నేను వస్తానని ఆయనకు తెలు

సునే, ఎందుకు ఇల్లాగ వెళ్ళిపోయినాడో'' అని తనలోతాను అనుకొన్నట్లు అనుకొని, మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చిన వాడి లాగ చూచి ధైర్యంతో ''సరే లెండి. ఇంకా కాసేపట్లో వస్తా డనుకొంటా'' అని జేబు గడియారాన్ని పైకి తీస్తున్నాడు.

''మీరువస్తా రని తెలిసే, మీకు కనపడకుండావుండాలనే వెళ్ళిపోయినాడు''అని గబుక్కున నోరుజారి అనేశాను. అన్న తరువాత విచారించాను. అయ్యో ఎందు కంటెనా, అనవసరంగా పెద్దమనిషి మనస్సునొప్పించానే అని.

పాపం ఆయన తెల్లపోయి. ''ఎందుకండీ, ఏమంత ఖర్మం ! అంత పారిపోవలసిన అవసరం ఎమీ లేదే!''అన్నాడు. ''భయం కాదుటండీ, అప్పులవాళ్ళను చూచినా అధికారులను చూచినా అని నే నన్నాను. కాని ఆయన ఏమీతృప్తి పడ్డట్టు కనపడలేదు. పైగా ఆయన ఆహ్వానం లేకుండానే లోపలికివచ్చేసి కుర్చీలోకూర్చున్నాడు. మావాడు భయపడ్డంతా అయింది. ఇక ఆయన వదిలేటట్టు లేదు. మీరు వెళ్ళండినేను తలుపు వేసుకొంటాను, అని అంటానికి నాకూ నోరురాలేదు. నేనూ మరోకుర్చీలో కూర్చుని, పేపరు చదువుతూ ఉన్నట్లు నటిస్తూ, ఈయనను సాగనంపటానికి మార్గం ఏదా అన్న ఆలోచనలోకి దిగాను.

బల్లమీద పుస్తకాలూ, పత్రికలూ, అవీ చాలా ఉన్నాయి. ఆయన ఒక ఇంగ్లీషు మాసపత్రికను లాగి పేజీలు

తిరగేసి, చివరకు ఏదో చదువుతూ ఉన్నట్లు చూడటం మొదలు పెట్టాను. మొదట ఆయన బొమ్మలకోసం పేజీలు తిరగేశాడు అనుకొన్నాను గాని చివరకు ఆయన ఏదో చదువుకొన్నట్లు తోచింది. ఏదో మూడో ఫారందాకా చదువుకొని ఉంటాడు. పైకి చదవండి, నేనుకూడా వింటాను అని అందామని అనుకొని మరీ ఏడిపించినట్లు అవుతుందని ఊరుకొన్నాను.

నేను అనుకున్నట్లే అయింది. ఆయన చదువుతూ ఉన్నట్టు నటనచేస్తున్నాడని తేలిపోయింది. ఎందుకంటే, పది నిమిషాలు కాకముందే, ఆయన పుస్తకాన్ని బల్లమీద పెట్టి పైకీ, కిందికీ, చూడటం సాగించాడు. ముందు ఆయన దూలాలూ, అడ్డకడ్డీలూ, లెక్క జూచుకొన్నాడు. దాని తర్వాత దర్వాజాలు లెక్కేసుకొన్నాడు. ఆపైన కిటికీలు ఎన్ని అయిందీ, ఒక్కొక్క కిటికీకి యెన్నిచువ్వలు ఉన్నదీ కూడా చూచుకొంటూఉంటే నాకు నవ్వొచ్చింది.

కాసేపు ఇల్లాగ చూచి, పాపం, ఆయన చివరకు నావంక జాలిగా చూస్తూ అడిగాడు. "ఏమండీ, ఎక్కడికి వెడతా నని చెప్పి వెళ్ళాడండీ ?" అని. అల్లాగ అడుగుతూ ఉన్న పెద్దమనిషికి (బియ్యపువర్తకు డయితేనేం!) మర్యాదగా జవాబు చెప్పకపోవటం తప్పు అని తోచింది నాకు. అందుకని ఈతభా నేను మర్యాదగానే జబాబు చెప్పాను. "ఆంధ్ర ఇన్స్యూరెన్సు హాలులో ఏదో టీపార్టీ ఉందని వెళ్ళాడండీ ?" అని.

"ఎన్నిగంటల కండీ. ఆ టీపార్టీ" అని అడిగాడు ఆయన. ఏమో నాకు తెలియదండీ అన్నాను నేను. ఆయనకు నేను వస్తానని తెలిసే! ఎందుకు వెళ్ళా డబ్బా! అని గొణుక్కొని అయితే, ఎప్పుడు వస్తాడని మీ అభిప్రాయం? అని అడిగాడు.

దొరికాడురా అనుకున్నాను. ఆయనను పంపివేయటానికి ఏదోమాట అనవలసిన సమయం అదేనని నిశ్చయించుకొని ఎప్పుడొస్తాడో చెప్పలేమండి. రాత్రికేగాని ఈ మధ్య రాడు. అదైనా రాత్రి పదకొండింటికి వస్తాడు, రావటం అంటూ ఉంటే. ఒకప్పుడు అదీ లేదు. నమ్మకం చెప్పలేము. ఒక్కొక్కరోజున ఇంటికి రానేరాడు, అన్నాను ఒక్క గుక్కలో.

ఈమాట వినికూడా ఎందుకు కూర్చుంటాడు ఎంత మొండివాడైనా? ఇక లేచిపోతాడు గదా అనుకొంటూ ఆయనవంక చూస్తూ కూర్చున్నాను. ఆయన ముఖంచూస్తే లేచిపోదామని నిశ్చయానికి వచ్చినట్లే కనపడ్డది.

ఆశ్చర్యపడుతూ పరధ్యాన్నంగా కాసేపు కూర్చుని ఆయన మళ్ళీ అడిగాడు. "ఏమండి, అయితే యింట్లోఆయనకు భార్యాబిడ్డలు లేరా?" అని.

"లే కేమండి? ఉన్నారు. ఉంటే ఏం? వాడికి భార్యా పిల్లలసంగతి పట్టిందీ?" అన్నాను నేను బొత్తిగా వాడు చెడిపోయినా డని చెప్పలేక చెపుతున్నట్లు.

నామాటలువిని ఆశ్చర్యపడి అడిగాడుమళ్ళీ. ''అయితే, ఆయన ఉద్యోగంలో ఉన్నాడుగదా; ప్రొద్దున్నే లేచి ఆఫీసుకు వెళ్ళవద్దా? ఇల్లాగ అయితే. ఆఫీసులో పనిచేయటానికి ఓపిక ఎక్కడనుంచి వస్తుందండీ?'' అని.

''ఆఫీసు పట్టిందిటండీ ఆయనకూ? ఎప్పుడో చేరుతాడు ఆఫీసుకు ఏపదింటికో, పదకొండింటికో.''

''అయితే పూర్వపు మనిషి కాదన్నమాట!''

''ఎబ్బే, పూర్వపు మనిషి కానేకాడు. అంతా కొత్త సిరస్తా మారిపోయినాడు. బొత్తిగామారిపోయినాడు. ఇంటి దగ్గర పెళ్ళాం ఒక్కతీరాన మొత్తుకొంటున్నది. పెందరాళే కొంపకు చేరుకోమని.''

''అయితే ఉండీ ఏమీ-లాభంలేదన్నమాట?'' అంటూ ఆయన లేచినిలబడి నావంక చూశాడు. నేను తల గట్టిగా ఊపుతూ ''ఉహూ, ఏమాత్రం లాభం లేదు. అసలు వస్తాడో రాడో కూడా చెప్పలేము'' అన్నాను.

ఇక ఉండి లాభం లేదని ఆయనకు గట్టిగాతోచింది. లేచి నిలబడ్డాడు. గుమ్మంలోకి వెళ్ళాడు. మళ్ళీ వెనక్కు తిరిగి ''అయితే మీ కేమౌతాడు ఆయన?'' అన్నాడు. నేను విచారపడుతూ ''మాబావమరదే నండి. చెప్పుకోటం సిగ్గు కూడాను!'' అన్నాను. ''ఉఁహు, అల్లాగుటండీ. మీ ఇంట్లో ఆయన అద్దెకు ఉన్నాడేమో, మీకూ, వారికీ పోట్లాటలు ఉండటం మూలాన అల్లా అంటూన్నారేమో అన్న సందేహంకూడా ఉండ నక్కరలేదన్నమాట!'' అని

వినపడీ వినబడనట్లు గొణుక్కుంటూ మెట్లు దిగి. నేను వెడతా-అన్నాడు.

నేను నవ్వుతూ, వెళ్ళడమే మంచిది. కూర్చుని ఏమీ లాభం లేదు. పైగా మీపనులు నష్టం! అన్నాను. ఆయన ముందుకు నడిచాడు.

వెనకనుంచి నేను, మీ రేమీ తొందర పడకండి. వాడితో చెప్పి అన్నివిషయాలూ నేను సద్దుబాటు చేస్తాను, అన్నాను. ఆయన నావంక వికారంగా చూచి నవ్వుకొని ముందుకు సాగినాడు.

3

ఆయనను అట్లాపంపించి, మాకాంతం, నేనూ, మా వాడి భార్యా అంతా కూర్చుని నవ్వుకొన్నాము. జరిగిన సంభాషణ అంతా వాళ్ళకు పూసగుచ్చినట్లు చెప్పాను. ఎన్ని అబద్ధాలు చెప్పారండీ, మాతమ్ముణ్ణి గురించి అన్నది మా ఆవిడ. ఒక్కొక్క సమయంలో, అల్లాగ అబద్ధమాడక తప్పదు, అని నేను సమాధానం చెప్పాను. ఎల్లాగోలాగు పీడ వదిలించుకొన్నాం గదా అని సంతోషించాము మేము.

ఓనిమిషం అయిందో, లేదో, ఎందుకో ఉత్తరపు కిటికీలోనుంచి తొంగిచూశాను. దగ్గరలో అర్థఫర్లాంగు దూరంలో ఉన్నాడు మావాడు. ఇంకెవరితోనో ఇద్దరితో కలిసి వస్తున్నాడు.

మా బావమరిది భార్యకూడా తొంగిచూచి, "వస్తున్నారండీ అదుగో...తలగుడ్డ పెట్టుకొని దర్జాగా నడుస్తున్నాడో కాయన, ఆయనే కామాలు అధికారి! అట్లా ఉన్నాడేం ఉసురోమంటూ ?" అన్నది. అధికారులు అట్లాగే ఉంటారమ్మా అని నేను అన్నాను. లేచి మళ్ళీ కిటికీలోనుంచి చూశాడు. అమ్మాయి అన్నమాటనిజమే. ముగ్గురూ వస్తున్నారు. జవాను పెట్టె నెత్తిన పెట్టుకొని ముందు నడుస్తున్నాడు. జవాను వెనకాల అధికారి, ఆవెనకాల మావాడూ కనిపించారు.

అధికారి వస్తున్నా డని నిశ్చయించుకొనేసరికి ఈ బియ్యపు వర్తకుడు ఇంకా అక్కడే ఉన్నాడేమో నని సందేహం వేసింది. తలుపు తీసి చూశాను. అక్కడే శని గ్రహంలాగ నిలబడి ఉన్నాడు వాళ్ళవంక చూస్తూ.

అధికారి ఎదటే తనబాకీ విషయమై మావాడిని నిలవేసి అడుగుతాడేమో నని భయం వేసింది. అందుకని గబగబా వీధిలోకి పోయి, ఆయన్ను వెనక్కు పిలిచి "చూడండీ, మావాడున్నూ, వాడున్న బ్యాంకి అధికారిన్నీ వస్తున్నారు. మీరు బాకీ సంగతి ఇప్పుడేం ఎత్తకండేం!" అని బ్రతిమిలాడాను.

"అబ్బే! ఆమాత్రం నాకు తెలియదుటండీ? వస్తున్నారుకదా. ఒకమారు కనపడి నమస్కారం చేసి వెడదామని నుంచున్నాను" అంటూ ఆయన వెకిలిగా నవ్వాడు.

"మిస్టర్ బాకీ, వారం రోజులలో తీర్చే ఏర్పాటు నేను చేస్తాను. మీరు వెళ్ళిపొండి" అని ఇంకోమాటు ఆయనకు గట్టిగా, చెప్పి, నేను గబాగబా ఇంట్లోకి వచ్చేశాను. కుర్చీలూ అవీ సర్దటానికి.

పెద్దమనుష్యులను రిసీవ్ చేయటానికి తగినపద్ధతిలో కుర్చీలుసద్ది వాకిట్లోకి వెళ్ళేసరికి మావాడు ఎదురై గబగబా నడుస్తూ ఒక్క గుక్కలో—వచ్చారు బావా—అంటూ లోపల అడుగు పెట్టాడు. నేను అక్కడే నుంచుని ఆ వర్తకుడివైపు తిరిగి వెళ్ళండి అని సంజ్ఞ చేశాను.

నామాట వినకుండా ఆయన మళ్ళీ ఇంట్లోకి ప్రవేసిస్తూ మావాడ్ని అడిగాడు. రమ్మంటారా అని. మావాడు ఆయనకు ఎదురుగా వెళ్ళి, వినయంగా నమస్కరించి, "నేను తమకోసం రైలుదగ్గరకు వెళ్ళాను. మీరు కారులో ముందుగా వచ్చారని గుమాస్తా చెప్పిందాకా నాకు తెలియనే తెలియదు" అన్నాడు.

తమరు వచ్చి చాలాసేపు అయిందా ఏమి టండీ! క్షమించండి, అంటూ ప్రాధేయపడటం చూచి నేను నిర్ఘాంతపోయినాను. స్టేషనునుంచి మావాడితో వచ్చింది గుమాస్తా, అనీ, ఈయనే అధికారి అనీ అప్పటికి నాకు తెలిసింది. నిలువునా నీరై పోయినాను. నోటమాట రాలేదుకూడా.

నేను ఆ స్థితిలో ఉండంగానే మావాడు ఆయనను నాకు ఎరుకపరచాడు. నేను ఆయనకు షేక్ హాండ్ ఇవ్వా

ల్సింది మరిచిపోయి కలయో, వైష్ణవమాయయో అన్న స్థితిలో ఉన్నాను. ఆయన నా చెయ్యి పట్టుకొని గట్టిగా ఊపి "మీ బావగారు. పేరేనా? పేరు విన్నాను, ఎప్పుడూ చూడలేదు" అని గట్టిగా నవ్వాడు.

అమ్మాయి తయారుచేసిన ఫలహారాలూ, కాఫీ, ముందుకు వచ్చినై. అందరూ సంతోషంతో కావిస్తున్నారు. నేను అయోమయస్థితిలో ఉన్నాను. ఆయన కులాసాగా ఏవో ప్రశ్నలు అడుగుతున్నాడు. మావాడు ఏదో వినయంగా సమాధానాలు చెబుతున్నాడు. నాకు మాత్రం ఆనందంగా లేదు. ఏదో గొప్ప తప్పు చేసినవాడిలాగ నేను బాధ అనుభవిస్తున్నాను. చివరకు ఆ అధికారి మావాడివంక తిరిగి "ఏమయ్యా, నీవు టీ పార్టీలకూ వాటికీ తరుచు వెళ్ళుతూ వుంటావా?" అని అడిగాడు. ఈ అడగటం మామూలు ప్రశ్న అడిగినట్లు లేదు. ఏదో ఎత్తిపొడుపు మాటలాగ ధ్వనించింది.

"ఎప్పుడైనా వెడుతూ ఉంటానండి! ఇవ్వాళ రెండు గంటలకు ఓ టీపార్టీకి వెళ్ళాను. అక్కడినుంచే యకాయకీని స్టేషనుకు వచ్చేశానండి" అన్నాడు మావాడు.

"అది సరే కొంపా గోడీ, ఏమీ పట్టించుకోకుండా తిరుగుతూ ఉంటావుటగా?" ఈ ప్రశ్నలో కొంచెం వేడి ఉన్నట్లు తెలిసిందిమాకు.

"ఎబ్బే, లేదండీ" అంటూ మావాడు తెల్లపోయి నాడు. "లేదనబోకు. రాత్రిళ్ళు నీవు ఇంటికి రావనీ,

వచ్చినా ఏ ఒంటిగంటకో, వస్తావనీ, నాకు తెలుస్తున్నది.'' అని అన్నాడాయన కీచు, దర్జా, ఉట్టిపడుతున్న కంఠ స్వరంతో. నాకు భయం వేసింది. అవమానంతో కుంగి పోయినాను.

''వట్టి అబద్ధం అండీ! ఎవరండి ఇల్లాంటి సంగతులు మీకు చెప్పింది? దుర్మార్గం, లేని పోనివి అల్లాగ చెప్పటం కేవలం దుర్మార్గం'' అని మావాడు గోల పెట్టాడు.

ఆ బ్యాంకి అధికారి వాడివంక ఇంకా కొరకొరా చూస్తూ ''దుర్మార్గంనీదిలాగ కనపడుతున్నది. నిన్ను గురించి ఇల్లాగ చెప్పింది బజారు మనిషి కాదు. చాలా పెద్దమనిషి'' అన్నాడు తీవిగా.

''ఎవరండీ ఆ పెద్దమనిషి! నన్ను గురించి నా అధి కారులతో ఇల్లాంటి అబద్ధాలు చెప్పినవాడు ఎల్లాంటి పెద్ద మనిషో చూస్తాను, ఆయనను నా ఎదటకు తీసుకురండి'' అని మావాడు విసుగ్గా అన్నాడు.

''ఎదుటకు తీసుకురావటం ఎంతసేపు! కాని ఇల్లాగ ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావే, ఆఫీసు పనులు నిలకడగా చేస్తావని ఎల్లాగ నమ్మకం?'' ఈ మాటలు ఆయన అధికారి లాగా అన్నాడు.

మా వాడు కలతపడ్డాడు. తోణికిపోయి, ''వట్టిదండి. ఆ చెప్పిన ఆయనను పిలిపించి న్యాయం విచారించాలి,'' అని ప్రాధేయపడ్డాడు.

నాకు ఏంజేయాలిసిందీ తోచలేదు. అంతకు పూర్వం నేను చెప్పినవన్నీ అబద్ధాలు అని ఒప్పుకొంటే నేను అధికారి దృష్టిలో వశ్చినుర్మార్గుడ్ని అయిపోతాను. కాదు, నేను చెప్పినదంతా నిజమే నని నిలవతొక్కుకుంటే మా వాడి మీంద ఆయనకు కోపంరావచ్చు. అందుకని ఏమీమాట్లాడ లేక ఊరుకొన్నాను.

చివరకు ఆయన మావాడిని అడిగాడు, "నిన్ను గురించి ఈ మాటలన్నీ నాకు చెప్పింది ఎవరో తెలుసునా?" అని.

మావాడు మాట్లాడ లేదు, "ఇదుగో ఈయనే మీ శావగారే!" అని నావంక చూపాడు.

పిడుగు పడ్డట్లు అయింది, మావాడు నిర్ఘాంతపోయి నావంక వెర్రిగా, జాలిగా, చూశాడు. నేనే కాస్త ధైర్యం తెచ్చుకొని "ఒక్క పొరపాటు జరిగిందండి. మిమ్మల్ని..."

అని ఏదో చెప్పవస్తుంటే ఆయన నామాటకు అడ్డొచ్చి "నాకు తెలుసులెండి మీరు పొరపడటం నేను గ్రహించక పోలేదు. ప్రయాణంలో మాసిపోయిన బట్టలూ, నేనూ, పెద్ద మనిషి అని అనుకొనే స్థితిలో లేక పోవటంమూలాన మీరు పొరపడ్డారు. అయినా ఒకరితో మట్టుకు లేనిపోని అబద్ధా లన్నీ చెప్పటం తప్పుకాదండీ?" అన్నాడు.

"తప్పేనండీ పొరపాటు అయిపోయింది." అని నేను నొచ్చుకొన్నాను. ఆయన విరగబడి నవ్వాడు.

కాసేపు అయినతరువాత నవ్వు ఆపుకొని అన్నాడు: "ఇల్లాగ మీరు అబద్ధాలాడటం ఇది మొదటిసారి కాదు. నేను చాలారోజులనుంచీ చూస్తున్నాను. మీరు వ్రాసిన దంతా చదువుతున్నాను. మహాకవికంటే ఎక్కువగా అబద్ధా లాడు తున్నారు" అన్నాడు.

ఈ మాటలు విని నే నేమీ మాట్లాడలేక పోయి నాను. ఆ తరువాత ఆయన మావాడివంక తిరిగి కోపంగానే చూస్తూ "అయితే నీవు బ్యాంకిలో ఉద్యోగంచేస్తూ ఊళ్ళో బాకీలు చేస్తున్నావు! బాగుందా ఇది!" అన్నాడు. "ఎబ్బే! ఎక్కడా బాకీలులేవండి. ఒక్కబియ్యపువర్తకుడకే యాభై ఇవ్వాలె. నాకు రావలసిన సొమ్ముకూడా చూస్తే ఈ బాకీ ఒక లెక్కలోది కాదని తమకు తెలుస్తుంది. నాకు పొలాల మీద రావాల్సిన రెండువందల రూపాయలు రైతులు ఇంకా తెచ్చి ఇవ్వలేదు. ఆ సొమ్ముకోసమే చూస్తున్నాను. ఈ వారంలో తప్పక వస్తుంది. రావటంతోనే ఈబాకీ తీర్చేస్తా నండి." అని మావాడు వినయంగా సమాధానం చెప్పాడు.

ఈ సమాధానం విని ఆయన ఏమాత్రం తృప్తిపడ్డట్టు కనిపించలేదు. ఆయన్ను, ఏదో సందేహం బాధిస్తున్నట్లు స్పష్టంగా, కనిపించింది. ఏదో ఆలోచిస్తున్నాడు. ఎందుకో విసుక్కొన్నట్లుంది.

ఆయనవైఖరీ చూస్తే నాకూ భయంవేసింది. ఆయన అన్నమాట నిజమే! బ్యాంకిలో ఉద్యోగం చేస్తూ, ఊళ్ళో

అప్పులు చేయుటం తప్పే. దీన్ని మనస్సులో పెట్టుకొని ఆయన మావాడికి ఏదైనా అపకారం చేస్తాడేమో నన్న భయం చాలా బాధ పెట్టింది. నేనుచేసిన పొరపాటువల్ల కదా ఇంత అవస్థ వచ్చిందీ అనుకొని కష్టపడ్డాను. మావాడూ విచార పడుతున్నాడు. అధికారీ విచారపడుతున్నాడు.

౪

ఇంతలో ఎవరో ఒకాయన చేత్తో ఒక పుస్తకం పట్టుకొని వచ్చి, గుమ్మంలో నుంచున్నాడు—ఎవరో చాలామంది ఉన్నారూ మనం వెళ్ళటం బాగుండదు—అని ఆయన అనుకొని ఉంటాడు. లేకపోతే అంతసేపు గుమ్మంలో నుంచోవలసిన పని లేదు. ఆయన వాలకం చూచి బియ్యపు వర్తకుడు ఆయనే అనుకొని మావాడి వంక చూశాను. వాడు మొదట ఆశ్చర్యపడి తరువాత తెల్లపోయినాడు. ఆ అధికారి నావంక ఓసారీ మావాడివంక ఓసారీ చూచి ఆ క్రొత్తగా వచ్చింది ఎవరైందీ గ్రహించాడు.

ఎవరికోసం? అని అధికారి ఆ క్రొత్తగా వచ్చిన ఆయనను అడిగాడు. పంతులుగారికోసం అంటూ ఆ వర్తకుడు మా బావమరిది వేపు చెయ్యి చూపాడు. దాంతో అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది ఆయన ఎవరు అయిందీ.

ఎల్లాగూ అందరికి తెలిసిన విషయమే కదా, ప్రత్యేకంగా జరగబోయే ప్రమాదం ఏమీలేదు అనుకొని నేనే

ఆయనను కూర్చోమని కుర్చీ చూపించాను. ఫలహారం ముందు పెట్టి కాఫీకూడా ఇచ్చాను. ఆయన నవ్వుతూ కూర్చు న్నాడు. మావాడుమట్టుకు పది లంఖణాలు చేసి, ఆ రోజునే పథ్యం పుచ్చుకొన్న వాడి ముఖం పెట్టాడు. ఆయన బియ్యపు వర్తకుడూ, డబ్బు అడగటానికి వచ్చాడూ అన్న సంగతి గ్రహించినప్పటినుంచీ. ఆ అధికారి నిప్పులు కక్కుతున్నాడు.

నేను ఈ విచిత్రసంఘటనను గూర్చి ఆలోచించటం మొదలు పెట్టాను. అధికారిని అనుకొన్నట్లు గౌరవించ లేక పోయినాను. కటువుగా మాట్లాడి పంపేద్దా మనుకొన్న షాహుకారుకు కుర్చీ యిచ్చి గౌరవించాను. మనం అను కొన్నది అనుకొన్నట్లు జరగక వ్యవహారం తలక్రిందు లౌతుం టుంది గదా అనుకొంటూ కూర్చున్నాను.

మావాడు ఏమీ మాట్లాడ లేదు. నిశ్చేష్టుడైపోయి నాడు. తలవంచుకొని కాఫీ తాగుతున్నాడు. అధికారి కప్పు చేత్తో పట్టుకొని కాఫీతో పాటు కోపాన్నికూడా కొంచెం కొంచెంగా మింగుతున్నాడు.

బియ్యపువర్తకుడు తన బాకీసంగతి ఏమీ ఇంతవరకూ తేలేదు. ఊరికే నవ్వుతూ కాసేపు కూర్చుని మావాడిని పలకరించి "వీరు మీ బావగారా?" అని నన్ను చూపుతూ అడిగాడు. అవునని మావాడు తల ఊపాడు. బ్యాంకు అధికారివంక చూస్తూ "వారు బంధువులా?" అని ఇంకో

ప్రశ్న వేశాడు. కాదు. మన బ్యాంకీ అధికారులని మావాడు చెప్పాడు. షాహుకారు విని ఆశ్చర్య పోయి. అల్లాగాఅండీ. నమస్కారం, అంటూ వినయం కనపర్చాడు.

నలుగురిలో బాకీ సంగతి ఎత్తకపోవడంవల్ల షాహుకారు మే మనుకొన్నంత చెడ్డవాడు కాడని తేలింది. అధికారి మట్టుకు కోపంగానే ఉండి చివరకు మావాడివంక తిరిగి, "వీరు ఎవరు?" అని అడిగాడు షాహుకారును చూపిస్తూ.

"బియ్యాపు వర్తకులు."

"ఎంత బాకీ వీరికి నువ్వు?"

"యాభై రూపాయలు."

"అప్పు చేశావటయ్యా? నీకు బ్యాంకిలో ఉద్యోగం ఏమిటి, ఊళ్ళో బాకీలు ఏమిటి? ఏమీ బాగుండ లేదు. ఇల్లాగ చేస్తివా నీ ఉద్యోగానికి నీళ్ళొదులుకోవాల్సి ఉంటుంది." అన్నాడు ఆ అధికారి ప్రతిమాటా తన దర్జాకు తగిన ఊపుతోనూ నొక్కుతోనూ. వర్తకుడిఎదుట తనదర్జా చూపటానికి ఆ అధికారి ఈమాటలు అనిఉంటాడు. లేకపోతే ఇదివరలో ఒకసారి ఇల్లాగ అనికూడా, మళ్ళీ ఇప్పుడు అనడం అవసరంలేదు.

"తీర్చివేస్తానండి వారం రోజులలో" అన్నాడు మావాడు.

"తీరుస్తా వనుకో. ఐనా నీవు అప్పు చేయకూడదు. అసలు ఈ విషయం నా చెవిని పడకుండా ఉండవలసింది. పడ్డ తరువాత దీని విషయమై యాక్షన్ తీసుకోక తప్పదు" అని కఠినంగా అన్నాడు అధికారి.

మావాడు ఏదో చెప్పలేక బాధపడుతున్నాడు. దీని కంతా కారణం నేను చేసిన పొరపాటుగదా అని నేనూ విచారపడుతున్నాను. నా చెవిని ఎందుకుపడ్డదా ఈ విషయం అని ఆ అధికారీ లోపల విచారపడుతున్నట్లు ఊహించవచ్చు.

షాహుకారుకు మట్టుకు ఈ గొడవ ఏమాత్రం తెలియ లేదు. కొంతసేపటిదాకా అధికారి అన్న కఠినవాక్కులు విని ఆయన ఉలిక్కిపడ్డాడు. పాలిపోయిన మొఖంతో ఆ షాహుకారు ఆ అధికారివంక తిరిగి అన్నాడు.

"ఏమండీ, పంతులుగారూ, నాకు బాకీ వున్నారన్న విషయాన్ని గురించేనా తమరు మాట్లాడుతున్నది ?"

"అవును. నీ బాకీ విషయమే."

"ఆయన నాకు బాకీ వున్నారని తమకు ఎవరు చెప్పారు ?"

"ఎవరు చెపితే ఏం ? ఆయన బావగారు చెప్పారు."

"వట్టి అబద్ధం అండి, ఆయన చెప్పింది. ఆయన మాటలే నమ్మారూ !" అన్నాడు షాహుకారు దీర్ఘాలు దీస్తూ.

నాకు చచ్చినచావు అయింది. వీడుకూడా నే నేదో అబద్ధం కల్పించి చెప్పాననేసరికి, పాపం అధికారే నావాలిటి దేవుడై ఆ కాస్తమాటా నిలవదీసి అడిగాడు. "ఆయన అబద్ధం ఆడుతున్నాడు అంటూ వేమయ్యా? నారాయణ మూర్తిగారు మట్టుకు అనటంలేదా బాకీ వున్నమాట నిజమేనని?"

"పాపం పంతులుగారికి తెలియక చెప్పారు. వారు నాకు ఒక్క దమ్మిడీ అయినా బాకీలేరు" అన్నాడు షాహుకారు.

అందరం పిచ్చిచూపులు చూశాము. షాహుకారుకు ఏమన్నా పిచ్చి ఎక్కలేదుగద అనుకొన్నాను. ఒక్కక్షణం అయినతరువాత మాకు ఒకటి తోచింది. మావాడి ఉద్యోగానికి మొప్పం వస్తుందని షాహుకారు ఎత్తిన ఎత్తు ఇది అనుకొన్నాము; అనుకొని సంతోషించాము. అధికారిమట్టుకు ఈ మాత్రం ఊహించలేడా? ఊహించి కూడా ఏమీ అన లేక ఊరుకొన్నాడు. ఎవ్వరం ఏమీ మాట్లాడలేదు.

నిశ్శబ్దం. ఎంతసేపు? అరనిమిషం. ఇంతలో అధికారి; ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగ చివుక్కున విసురుగా తల ఎత్తి షాహుకారువంక చూస్తూ "నీకేం బాకీ లేనే లేదా? ఏదీ పుస్తకంలో జమ వుందేమో చూడనీ"

అన్నాడు. మంచి ప్రశ్న. అధికారికూడా చాలా తెలివైన వాడు అనుకొన్నాము.

వర్తకశిఖామణి ఎత్తిన ఎత్తు గొప్పదే. కాని అధికారి ఇల్లాగ పుస్తకం చూపమనిఅడుగుతాడని వూహించిఉండడు. అంచుకని కాపీ చేస్తుండగా పట్టుబడ్డ స్కూలుకుర్రాడులాగ తెల్లముఖం వేస్తాడని అందరం ఒక్కసారి అటు చూశాము.

వర్తకుడు తెల్లముఖం వెయ్యలేదు. ధైర్యంగా, నిశ్చలంగా చూడండి కావలిస్తే—అంటూ పుస్తకం ఆయనకు అందించాడు. నేనూ, మా వాడూ, అధికారీ, అక్కడున్న వాళ్ళం అందరంకూడా, ఆకాశంలోనుంచి, ఏదో, విచిత్ర వస్తువు కిందికి దిగుతూవుంటే, అది బాంబా, విమానమా, మనిషా, బొమ్మా ? అని ఎంత విస్మయంతో చూస్తామో అంత విస్మయంతో చూశాము ఆ పుస్తకంవంక.

అధికారి పుస్తకాన్ని ఇంకా సందేహంతోనే అందు కొని, పేజీ తీసి, తాను చదువుకొని నవ్వుకొన్నాడు. అసలు సంగతి ఏమిటో చెప్పకుండా ఆయన ఒక్కడే ఆనందించటం నాకు కష్టంగా ఉండి, ఊరుకోలేక—నిజమేనాఅండి ? జమ ఉందా?—అని అడిగాను ఆదుర్దాగా.

అప్పటికి ఆయన స్పష్టంగా జబాబు చెప్పక అవు నన్నట్లు తల ఊపాడు; నవ్వాడు. నవ్వి మావాడివంక చూశాడు,

ఆ తరువాత నన్నుజూచి నవ్వాడు. ఇల్లా నవ్వడం వల్ల నాకేదో సందేహం కలిగింది. జమఉంటే, ఉంది అని చెపితే సరిపొయ్యేది. ఆయన అట్లా చెప్పక ఊరికే అందర్ని జూచి నవ్వటం సాగించాడు.

అందరికీ ఏమైనా అర్థం అయిందా అంటే ఒక్కరికీ నిజం ఏమి టైందీ తెలిసినట్లు లేదు. అంతా ఆయనకు గుడ్లు అప్పగించి తెల్లపోయి చూస్తున్నారు.

ఎంత సేపని ఊరుకోగలను? చివరకు నేనే నోరు చేసుకొని మావాడ్ని అడిగాను; "ఏంరా ఇచ్చి మరిచి పోయి నావా ఏమిటి"—అని

"ఎబ్బే నే నివ్వలేదు. బాగా జ్ఞాపకం. నేను డబ్బుకు సంబంధించిన విషయాలు ఎప్పుడూ మర్చిపోను—"అని వాడు ఘట్టిగా చెప్పాడు.

అందరం తెల్లపోయినాము. ఏమీబాకీ లేకపోతే ఆయన అల్లాగ బాకీ కోసం తిరగటం ఎందుకు సంభవించింది? బాకీ ఉన్నట్లతే జమ ఎట్లా పడిఉంటుంది! ఈప్రశ్నలకు సమాధానం ఏమీ తోచలేదు. పశ్కా రెండు నిమషాల సేపు అందరం ఆ అధికారి వంక చూస్తూ కూర్చున్నాము.

ఈ పరిస్థితులు చూచి వర్తకుడు అప్పటి కప్పుడు జమ కట్టటానికి ఏమాత్రం అవకాశంలేదు. అయినా తెలుసు కొందామని "జమ ఎప్పుడో చూడండి" అని అడిగాను అధి

కారిని. ఆయన నవ్వుతూ "షాహుకారు చేసిన మాయ ఏమి లేదు. ఇరవై రోజుల క్రింద జమ పడ్డది" అన్నాడు. ఈ తమాషా ఎట్లా జరిగిందో ఎవ్వరికీ తెలియలేదు.

"ఏమిటయ్యా ఈనాటకం?"అని నేను షాహుకారునే అడిగాను. ఆయన "పుస్తకంలో ఏమి రాసిఉందో పంతులు గారినే చదవమనండి తెలుస్తుంది" అన్నాడు.

అందరం అధికారి వంక తిరిగాము "చదవండి తొందరగా" అన్నట్లు చూస్తూ.

అధికారి "ఇక్కడ ఉన్నది చదువుతాను వినండి. ఈ బాకీకి గాను, నారాయణమూర్తిగారి భార్య ఇచ్చిన రొఖ్ఖం యాభై రూపాయలు, అక్షరాల యాభై రూపాయలు" అని చదివి ఊరుకొన్నాడు.

విస్మయం, ఆనందం తోసుకొన్నాయి మా హృదయాల్లో. అందరికంటె మావాడు ఎక్కువగా ఆశ్చర్యపోయినాడు. ఒక్క నిమిషం ఎవ్వరం రెప్పవాల్చలేదు. ఏవిధమైన శబ్దమూ చెయ్యలేదు. మరుక్షణంలో చీకట్లను చీల్చుకొని వచ్చిన మెరుపుల్లాగ అందరి ముఖాలపైన చిరునవ్వు మెరిసింది. మెరుపుల వెంట ఉరుములు, అందరు విరగబడి నవ్వారు.

అందరితోపాటూ మావాడునవ్వాడు మొదట. కాని వెంటనే వర్తకుడ్ని తొరతొరా చూస్తూఅడిగాడు; "ఏమయ్యా

సొమ్ము ముట్టిన తరువాత కూడా, ఆ సంగతి నాకు చెప్పక, అల్లాగ, కాళ్ళు అరగిపోయే లాగున తిరిగి సొమ్ము ఇమ్మని వేధించావు! నిజంగా బాకీ ఉన్నప్పుడు ఎప్పుడూ అడిగి ఎరుగవు! బాకీ లేనప్పుడు ఇల్లా బాధపెట్టావు. ఏమిటది ?'' ఈ అనటం కోపంగానే అన్నాడు.

''ఇదివరకు అంటే నా స్వంత బాకీ కాబట్టి మీరు ఎప్పుడిచ్చినా పుచ్చుకొన్నాను. సొమ్ము అందటంతోనేమీరు ఇస్తారని ధైర్యం. ప్రత్యేకంగా అడగటం అవసరం లేక పోయింది. ఆరోజున ఏదో అవసరం వచ్చి అడగ్గానే, అమ్మాయిగారు బాకీ మొత్తం యావత్తూ నాకిచ్చి, మళ్ళీ ఆసొమ్ము యావత్తూ మీ వద్దనుంచి వసూలు చేయమని కోరారు. ఆమెగారు ఇచ్చారని చెబితే మీరుమళ్ళీ ఇయ్యరు. అందుకని ఆవిషయం మీకుచెప్పలేదు. కాని మీరు నాకు బాకీ లేకపోయినా ఆమెకు బాకీ పడ్డారు అమ్మాయిగారికి ఇవ్వాల్సిన సొమ్ముకోసమే నే నంతగా తిరిగింది. నాసొమ్ము కోసమైతే తిరగనే తిరగను'' అన్నాడు. అంతా విని నవ్వుకొని ఊరుకొన్నారు.

ప

సాహుకారు పాపం, అమాయకంగా, అధికారి మా వాడికి అపకారం ఏమైనా చేస్తాడేమోనన్న భయంతో

ఉన్నది ఉన్నట్లు చెప్పారు. అందులో ఏమీ సందేహం లేదు. ఈ సంగతి అంతా విని అందరూ మరోసారి నవ్వుకొన్నారు. చాలా తమాషా అయిందనుకొన్నారు. అంతవరకు బాగానే ఉంది.

దాని తరువాత జరిగిన కథే నాకు కష్టం కలిగించింది. షావుకారు సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. అధికారి మావాడితో అన్నాడు: "నీవు ఏదో బాకీ చేశావని నాకు తెలియడం మూలాన, నేను స్నేహరీత్యా నిన్ను మందలించాను గాని మరోటిగాదు. పెద్దవాడిని కాబట్టి నీకు మంచి మాట చెప్పాను. నేను అన్నమాటలు మనస్సులో ఉంచుకోకేం!" అని.

మావాడు ఆయనతో "తమకేం తెలుసూ? అయినా తమరు అన్నది ఏమీ లేదు" అని నవ్వి ఊరుకొన్నాడు.

"నారాయణమూర్తిగారికి, పాపం, ఏమీ తెలియదు. భార్య బాకీ తీర్చిన విషయమూ తెలియదూ, ఆయన బావగారు ఈసంగతంతా తమకుచెప్పిన విషయమూ తెలియదు! పాపం ఆయన అనవసరంగా ఖంగారుపడటం సంభవించింది." అన్నాడు గుమాస్తా అధికారితో. అందరికీ వాడి విషయంలో సానుభూతి కలిగేలాగున, అందరూ వాడ్ని చూచి జాలిపడ్డట్లు చూపులు చెపుతూనే వున్నాయి.

అసలు ఈ గలాభాకు అంతా మూలకందం మావాడి భార్య. ఇట్లా సంగతి అని మాటమాత్రం అన్నా నాకు చెప్ప లేదు. ఇంత గ్రంధం జరుగుతూవుంటే ఊరుకొనివుండే కాని అసలు రహాస్యం బయటపెట్టలేదు. ఆ అమ్మాయిని ఇదేమని ఒక్కరూ ఒక్కమాట అయినా అనలేదు. పైగా చాలా తెలివైంది అని మెచ్చుకొన్నారు.

ఇక మిగిలిపోయింది నేను. నా సంగతి ఒక్కరూ ఎత్త లేదు. ''పాపం. ఈయన అన్యాయంగా ఫూల్ అయి పోయి నాడు'' అని ఒక్కరూ–ఒక్కరైనా జాలి చూపలేదు.

వారి సానుభూతిని ఆసిస్తూ, చివరకు నేనే అన్నాను. ఇంతకూ, నేను మిమ్మలను చూచి వర్తకుడు అనుకోటం వల్ల, ఇంతగొడవ జరిగింది అనుకోండి. కాని ఇందులో నాతప్పు ఏమీ లేదు. అల్లాగ ఎందుకు అనుకోవలసివచ్చిం దంటే...అని చెప్పబోతుంటే, వాళ్ళు వినక, ఎల్లా సంభ విస్తే ఏం లెండి కథ నడిపారు. అని నవ్వారు ఈ గొడవంతా నేను కావాలని తెచ్చి పెట్టినట్టు.

---

## మునిమాణిక్యం నరసింహారావుగారు

కాంతం కథలనే పేరుతో ప్రసిద్ధులైన మునిమాణిక్యం నరసింహారావుగారు 1898 లో గుంటూరు జిల్లాలో సంగం జాగర్లమూడి గ్రామంలో జన్మించినారు. గుంటూరులోనూ, విజయనగరంలోనూ విద్యాభ్యాసం చేసినారు. (బి.ఏ.ఎల్.టి.) బందరు హిందూ కాలేజి హైస్కూలులో చాలకాలము చరిత్రోపాధ్యాయులుగా పనిచేసి రిటైరు అయి విశ్రాంతి పుచ్చుకొంటున్నారు.

మునిమాణిక్యంవారిని చూచి ముసిముసి నవ్వు నవ్వని ఆంధ్రుడు ఉండడు. వీరి రచనలు అన్నీ నవ్వించేవే। గృహ జీవితములోని కళాప్రసక్తములైన రసవద్వినోద కలాపాలను కథావస్తువుగా తీసుకొని ఇరవై అయిదు గ్రంథములు వ్రాసినారు. గార్హస్థ్య జీవిత సౌందర్యమును మనోహరంగా ఆవిష్కరణ చేసినారు. ఆంధ్రుల అభిమానకథకుడు. "కాంతం కథ వ్రాస్తే మునిమాణిక్యమే వ్రాయాలె. మునిమాణిక్యం వ్రాస్తే కాంతం కథ వ్రాయాలి" అన్నారు విమర్శకులు. వీరివలె సాంసారిక జీవితములోని రమణీయ దృశ్యాలను చిత్రించినవారు ఇంకొకరు లేరు.

# తగూ నెంబరు 'త్రీ'

[ ఇతర కథలు ]

ర చ యి త

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

ప బ్లి ష ర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రా జ మ ం డ్రి.

# విషయసూచిక




| | | | | |
|---|---|---|---|---|
| 1. | తగూ నెంబరు 'త్రీ' | .... | .... | 5 |
| 2. | అనంగా. అనంగా | .... | .... | 23 |
| 3. | సుందరం భార్య | .... | .... | 33 |
| 4. | ప్రాయశ్చిత్తం | .... | .... | 47 |
| 5. | ఇంటర్వ్యూ | .... | .... | 52 |

# తగూ నెంబరు 'త్రీ'

శర్మ జానకమ్మతో మళ్ళీ పోట్లాడాడు. వద్దురా నాయనా ఆ పిల్లను ఏమీ అనకు, సర్దుకుపో ఎల్లాగో ఒరగ బెట్టుకొని సంసారం చెయ్యాలి అని ఎన్నివిధాల చెప్పినా వాడి మనస్సుకు ఎక్కలేదు.

ఆ పిల్ల తనను గౌరవించటం లేదో అంటాడు.

ఓరి తెలివితక్కువ శర్మా,

పెళ్ళాము అన్న మనిషి, మొగుడు అన్న వాడిని ఎప్పుడూ గౌరవించదురా అని నెత్తిని నోరు పెట్టుకొని అర చినా వినిపించుకోడాయె!

లోకంలో పెళ్ళాలు, మొగుళ్ళను గౌరవిస్తున్నారూ అనుకోటం పెద్ద పొరపాటురా నాయినా, నా భార్య నన్ను ఏమాత్రం గౌరవిస్తున్నదీ చూస్తున్నావు కదా: అందరి సంగతీ అంతేరా అంటే వినడు, పైగా, నేను తెలివితక్కువగా భార్యకు లొంగిపోయినానసీ, తాను మహా తెలివిగా భార్యను అదుపుఆజ్ఞలలో ఉంచగలననీ గర్వపడ్డాడు, ఆ గర్వం కాస్తా అణిగింది!

మా కాంతమే నయం! కొట్లాడినా, పోట్లాడినా గుమ్మందాటి ఎఱుగదు! జానకి పుట్టింటికి వెళ్ళిపోయింది!

ఢంకామీద దెబ్బకొట్టినట్లు వెడుతున్నానని చెప్పి వెళ్ళిపోయింది.

నేనే అయితే ఆడమనిషిని గడపదాటనిచ్చేవాడినా? తెలివితక్కువ దద్దమ్మ కాబట్టి శర్మ ఆవిడ వెళుతూ ఉంటే కళ్ళు మిటకరించి చూస్తూ ఊరుకొన్నాడు.

పొద్దున పదిగంటలకల్లా పోట్లాట అయిపోయిందట! పదకొండింటికి భోజనంచేసి, పన్నెండింటికి ఆ పిల్ల 'ఇదిగో మీకే చెపటం, నేను వెళ్ళిపోతున్నాను బండి వచ్చింది, అని చెప్పి మరీ వెళ్ళిందట.

శర్మ ఈ మాటలు విని ఊరుకొన్నాడు పన్నెండు గంటలకు బెజవాడ వైపుకు వెళ్ళే బండి ఏదీ లేదు. అయినా ఆ పిల్ల ఆ కొంపలో ఉండ టానికి ఇష్టంలేకే వెళ్ళి పోయి ఉండాలె.

మొగుడూ పెళ్ళామూ అన్న తరువాత ఏవో పోట్లా టలు ఉండకుండా ఉంటయ్యా, అంత మాత్రానికే ఇల్లూ వాకిలీ, మొగుణ్ణీకూడా వదిలేసి వెళ్ళిపోతున్నారా అందరూ!

శర్మకు నోరుంటే అంతపని జరిగేదికాదు. "నీవు వెళ్ళ దల్చుకొంటే నాకేమీ అభ్యంతరం లేదు. కాని రెండు గంటల బండికి వెళ్ళేవాళ్ళు ఎవ్వరూ పన్నెండు గంటలకే బయలుదేరరు. అందులో స్టేషను అంత దగ్గరలో ఉన్నపుడు ఓ పావుగంట ముందుగా బయలుదేరితే చాలు అని అందా మనుకొన్నాడట అనుకొంటూ ఉండగానే ఆమెగారు వెళ్ళి పోయిందట!

అట్లా అందామని అనుకోకపోతే 'ఏడిశావులే, ఇల్లు కదలటానికి వీల్లేకు ఈ ఎండలో, తలుపులన్నీ వేసి పడిఉండు అందామని అనుకోకూడదూ. ఇల్లాగ అనుకొంటానికైనా శర్మకు ధైర్యం లేకపోయింది. ఇంతకూ ఏదో అందామని అనుకోటమేగాని ఏదీ అన లేదు! ఆ పిల్ల సుటుకు నేను వెడుతున్నానండోయ్! అని పబ్లీకుగా చెప్పి మరీ వెళ్ళిపోయింది.

తాను ఆ మాటలు విననట్లూ ఆ వెళ్ళటం చూడనట్లూ శర్మ నటించాడేకాని నిజానికి దొంగచూపులుచూచి ఆ పిల్లను ఓ కంటితో కనిపెట్టాడు. శర్మ అనుకోవటము ఏమిటీ అంటే. తానేమీ తెలివితక్కువవాడు కాదూ అని! అయితే తలెత్తి ఎందుకు చూడలేదూ అన్నప్రశ్న వస్తుంది. శర్మ ఆ విషయమై బాగా ఆలోచించే తల ఎత్తకూడదని నిశ్చయించుకొన్నాడు. తలెత్తి చూస్తే చాలా ఇబ్బందులు వస్తవి. ఆవిడ ఇల్లు వదలి వెళ్ళుతున్నట్లు గమనించిన తరువాత ఆవిడను పోనీయటము తన దర్జాకు లోపము. "ఏయ్ ఎక్కడికీ? నోరుమూసుకొని పడిఉండు అని అనగలిగితేనే తల ఎత్తాలె అల్లాగ అనే శక్తి లేనపుడు గుట్టు చక్కంగా, తలదిండులో దూర్చి నిద్రపోతున్నట్లు నటించటమే తెలివైన పని అని అతని ఉద్దేశం. ఇతడు నిద్రపోతున్నాడా, మేలుకొని ఉన్నాడా అని తెలుసుకొంటానికైనా ఆ పిల్ల ప్రయత్నం చెయ్యలేదు, సాధారణంగా ఆ పిల్ల ఎక్కడికైనా పోయ్యే ముందు శర్మ దగ్గరకువచ్చి వెడుతున్నానని చెప్పి ఊరుకోదు మీద చెయ్యి వేస్తుంది. అటూ, ఇటూ పొర్లిస్తుంది.

అప్పటికీ తనకు మెలకువ రానట్లే శర్మ నటిస్తాడు. అబ్బ అదంతా నిద్రే! ఎందుకంటే ఆ దొంగనిద్ర! నిద్రపోయే వాళ్ళు నవ్వుతారు కామాలేం? అని ఇల్లాగ ఏవో తమాషాగా మాట్లాడి నవ్వించి మరీ వెళ్ళేది! ఇవ్వాళ అల్లాగ ఎందుకు చేస్తుందీ? పోట్లాట అయిన తరువాత కోపంతో వెడుతూ ఉండె! అందుకని అతనిని పలకరించకుండానే వెళ్ళి పోయింది.

శర్మమటుకు ఎంత అసాధ్యుడు! భార్య వెడుతూ ఉంటే ఏమైనా కానీయమని తలెత్తి చూడకుండా పడుకొన్నాడు. ఎంత గుండె నిబ్బరంగల మనిషి కాకపోతే అల్లాగ పడుకొని ఊరుకోగలడు. ఇంకొకరు అయితే గిల గిల్లాడక పోయినారూ!

జానకి ఖద్దరు సిల్కు చీర కట్టుకొని వాయిల్ రవిక తొడుక్కొని, స్లిప్పర్లు తొడుక్కొని టక టకలాడిస్తూ వెళ్ళి పోయింది. అంతవరకు శర్మ కనిపెట్టాడు. ట్రంకు పెట్టా, మరచెంబు తీసికొని వెళ్ళినట్టు నాలుగు చీరలు ఏమైనా మూట గట్టుకొని పోయిందేమో, ఆ విషయం శర్మ చూడలేదు.

౨

శర్మ అత్తగారు బెజవాడలో ఉన్నది. జానకి అక్కడికే వెడుతుంది. ఆ ధైర్యంతోనే శర్మ అంతగా గాభరా పడలేదు. శర్మ ఆలోచిస్తూ పడుకొన్నాడు.

జానకి బెజవాడ వెడుతుంది. తన సంగతి తల్లితో చెబుతుంది. ఇదీ ముందు జరిగే పని, అల్లాగ జానకి తన్ను గురించి ఆమెగారితో ఉన్నవి కొన్నీ లేనివి కొన్నీ కల్పించి చెపితే తనకు వచ్చిన నష్టం ఏమిటా అని ఆలోచించాడు.

శర్మకు వచ్చిన నష్టం ఏమీ లేదు—ఆమె మటుకు కూతురితో—"మహా మంచిపని చేశావే తల్లీ !

ఇక ఆ కొంపకు నీవు పోవద్దు" అంటుందా ?

ఎప్పటికీ అనదు.

రెండురోజులు అయిపోయిన తరువాత ఆ పిల్లకు చెప్ప వలసిన మాటలు చెప్పి, తీసుకొచ్చి దిగబెడుతుంది. ఇంతలోకే వచ్చిన ప్రమాదం ఏమీ లేదు.

ఇక రెండో విషయం. జానకి అల్లాగ వెళ్ళిపోతూ ఉన్నప్పుడు తాను మెదలకుండా ఊరుకొన్నాడు అది మంచి పనేనా !—

ఈ విషయమై శర్మ చాలా తీవ్రంగా ఆలోచించాడు. ఊరుకోక ఏమి చెయ్యాల్సింది ? ? ?

తప్పు అల్లాగ వెళ్ళిపోకూడదు. భర్త అంటే దైవము భర్త పాదసేవ చేయుటమే స్త్రీ యొక్క ధర్మము. పతిని విడిచి పడతి ఉండరాదు, అని చెప్పి సీత, అనసూయ, అరుంధతి మొదలైన పతివ్రతల కథలు చెప్పాలిసింది, శర్మకు సంస్కృత శ్లోకాలు కూడా వచ్చును, అల్లాంటి సమయంలో

ఎటువంటి పాఠం చెప్పవచ్చు! మంచి అవకాశాన్ని పోగొట్టుకొన్నాడు. ఈ విషయమై శర్మచాలాసేపు ఆలోచించి పొరపాటే జరిగి పోయింది అనుకొన్నాడు.

కాని అల్లాగ నీతిబోధ చెయ్యాలని శర్మకు జ్ఞాపకం వచ్చినా చేసే మనిషి కాడు, అదోరకం మనిషి, భార్యతో అట్టే మాట్లాడకూడదు అని అనుకొనేరకం, అదీకాక శర్మకు ఆడ భిడియం కూడా ఉందికొంత, అందుకనే అతడు భార్య వెళ్ళి పోతూఉంటే ఏమీ అనలేక పోయింది!

సరే, జరిగిందేమో జరిగింది, ఆ అమ్మాయి వెళ్ళి పోయింది.

ఇప్పుడు చేసేది ఏమీలేదు. హాయిగానిద్రపోదామా అనుకొన్నాడు శర్మ నిద్రపోవచ్చును కూడాను మాట్లాడించే వాళ్ళుకూడా లేరాయె ఇంట్లో! నిద్రపోయి లేచిన తరువాత తనకు కావలసిన ఫలహారం కూడా ఆ అమ్మాయి అక్కడే బల్లమీద పెట్టి మరీ వెళ్ళింది, బల్లమీద గుండుచెంబులో మంచినీళ్ళుకూడా ఉన్నవి ఇంకా తనకు కావలసిందేముంది! హాయిగా నిద్రపోయి సాయంత్రానికి హోటలులో చేరితే సారె!

సరిగ్గా ఇల్లాగే అను కొనుకొన్నాడు శర్మ—కోపంవస్తే మటుకు ఆ అమ్మాయి అల్లాగ చటుక్కున వెళ్ళిపోవటం తనను వదిలేసి ఏమంత మంచిపని కాదనే నిశ్చయానికివచ్చి, సరేకానీ చూద్దాం, అని తల పంకించాడు శర్మ.

ఆమెకోసం తాను రైలు స్టేషనుకు వెళ్ళాలా అని ఇంకో ప్రశ్న వచ్చింది. మళ్ళీ ఆలోచించాడు. ఈ తఫా చాలా తొందరగానే ఒక గట్టి నిశ్చయానికి రాగలిగినాడు. ఏమిటీ అంటే అతను ఆమె కోసం వెళ్ళనూ వెళ్ళడు. బ్రతిమి లాడనూ బ్రతిమిలాడడు. ఇల్లాంటి పిచ్చిపనులు ఏమీ చెయ్యడు.

ఆమెవస్తే, వస్తుంది. రాదూ!

రాకపోనీ, ఎన్నాళ్ళు రాకుండా ఉంటుందో, ఆ సంగతీ కనుక్కొంటాను. శర్మ ఇల్లాగ నిశ్చయించుకోటం చూస్తే తెలివి తక్కువ వాడు కాదూ అని తోస్తుంది. ఏం? బియ్యే. ప్యాసు ఆయె! తెలుగు పండితుడు—పద్యాలు కూడా వ్రాస్తాడు. తెలివితక్కువ వాడు అయ్యే ఖర్మం అతని కేం పట్టింది నిజానికి!

కాని ఒక్కటి! మనస్సు నిబ్బరంలేదు శర్మకు. చిన్నతనం కూడాను. ఇప్పుడు చూడండి, శర్మ అల్లా అనుకొని హాయిగా నిద్రపోవచ్చునా—నిద్రపో లేదు మరి!

ఏమిటీ అతని బాధ?—అవిడ మంచి ఎట్టని ఎండలో వెళ్ళింది, వడగాల్పు ఏమైనా తగిలి పడిపోయిందేమో నని భయం ఆ పిల్ల ఏమీ తెలివి తక్కు.వదిగాదు—స్టేషనులో వెయిటింగు రూములో కూర్చునే ధైర్య సాహసాలుగల మనిషి.

ఇదొక్కటే కాదు శర్మకు ఇంకా అనేక భయాలు పట్టుకొన్నవి. ఆ అమ్మాయి ఒక బండి ఎక్కబోయి, ఇంకో బండి ఎక్కుతుందేమో నని, అసలు ఆ జనంలో టిక్కెట్టు పుచ్చుకో లేదేమో నని ఆలోచనలుఅతనికి! పోట్లాడి వెళ్ళిన మనిషిమీద ఇతడికి కోపంలేక బోవటం ఏమో అని పిస్తుంది.

నిజం సంగతి ఏమిటీ అంటే అతనికి భార్యమీదకోపం లేకపోలేదు. ఉన్నది ఆమె వెళితే వెళ్ళింది. అందుకనికాదు అతను తహాతహా పడుతున్నది. ఈమెతల్లిగా రింటికి సుఖంగా ప్రయాణంచేస్తే బాగుండును అని అతను ఆదుర్దా పడుతు న్నాడు కాని తనను వదిలి వెళ్ళిపోయి నందుకు కానేకాదు. అందుకనే అతడు స్టేషనుకు పోయి టిక్కెట్టుకొని ఆ అమ్మా యిని ఆడవాళ్ళ పెట్టెలో కూర్చోబెట్టి వద్దామా అని అను కొన్నాడు ఒక క్షణంలో.

కాని అల్లాగ చేస్తే బెట్టుపోతుంది. అన్యాయంగా పోట్లాడటమే కాకుండా ఇల్లు వదలి వెళ్ళిపోయిన మనిషి విష యమై జాలి తల్పకూడదు. ఇబ్బంది పడనీ, తెలిసి వస్తుంది. అని మళ్ళీ అనుకొన్నాడు.

అనుకొన్నవాడు ఇక ఆ అమ్మాయి సంగతి ఆలోచిం చటం మానేస్తే శర్మ గట్టివాడే అనొచ్చు. మానెయ్యలేడే. అనేక విషయాలు జ్ఞాపకం తెచ్చుకొన్నాడు ఆమెమీద కోపం పుట్టటానికి.

రాత్రిళ్ళు చదువుకొంటూఉంటే ఆపిల్లవచ్చి పుస్తకం మూసెయ్యడమూ, మహా చదివారు లెద్దురూ ఎందుకొచ్చిన చదువు అని అనటమూ వెక్కిరించటమూ అన్నీ జ్ఞాపకం వచ్చినవి.

తన కవిత్వాన్ని ఆమె ఎప్పుడూ మెచ్చుకోలేదు. పైగా మీ కవిత్వం నాకేమీ అర్థంకాదు. ఎవ్వరికీ అర్థం కాని పద్యాలు ఎందుకూ మీరు 'వ్రాయటం?' అంటుంది. ఛీ ఛీ—జానకి తన కెందుకూ కలిసిరాలేదు. పూర్వం కవులకు ఇల్లాంటి భార్యలే ఉండేవాళ్ళా? ఉన్నట్లయితే వాళ్ళు అల్లాంటి గ్రంథాలు వ్రాయగలిగే వాళ్ళా? తాను చిత్తుగా వ్రాసినదాన్ని ఫెయిర్‌గా వ్రాయటం కూడా చేతగాని మనిషి. ఆవిడతో కాపరం చెయ్యటమే తన జీవితంలో ఒక గొప్ప త్యాగం ఆ సంగతి ఆ పిల్లకొంచెం అయినా గ్రహించలేదు.

తాను సౌందర్య స్వరూపం తెలిసిన మనిషి. ప్రసిద్ధ చిత్రకారుల చిత్రాలు, అజంతా చిత్రాలు, మొదలైనవి స్టడీచేసేవాడు. కాబట్టి తన అభిరుచియందు గౌరవం ఉంచి ఆమె తను ఎట్లాచెయ్యమంటే అట్లాగ చెయ్యాలె, ఏ చీర కట్టుకోమంటే ఆ చీర కట్టుకోవాలె. ఏ రవిక తొడుక్కోమంటే ఆ రవిక తొడుక్కోవాలె. అట్లా ఉండవలసిన స్థితిలో...ఆ పిల్ల ప్రతివిషయంలోనూ, తనకు వ్యతిరేకమే కద! ఈ విషయాలన్నీ జ్ఞాపకం వచ్చేసరికి శర్మకు జానకిపైన బాగా కోపమూ వచ్చింది. అసహ్యమూ

కలిగింది. ఏమన్నా కానీ స్టేషనుకు వెళ్ళకూడదు అను కొన్నాడు.

కాని ఒక్కవిషయం అతనిని బాధిస్తున్నది. తన భార్య స్టేషనులో ప్లాటుఫారం మీద ఒంటరిగా నుంచు న్నప్పుడు కుఱ్ఱవాళ్ళు ఆమెను ఎగా దిగా చూస్తారే అని అతనికి కష్టంగాఉంది. తాను ప్రక్కననుంచుని ఉంటే, ఆవిడను కన్నెత్తిచూడటానికి ఎవ్వరికీ గుండెలుండవు. ఒంట రిగా ఉన్న ఆడపిల్లను అంతా చూస్తారు; కొందరు ధైర్యం చేసి మాట్లాడిస్తారు కూడా; ఛా, ఎంత అప్రతిష్ట!

ఈ ఒక్క విషయమే అతనిని ఎక్కువగా బాధపెట్టి స్టేషనుకు వెళ్ళుదామా అని అనుకొనేటట్లు చేసింది. కాని తీరా వెడితే ఏమన్నా బాగుంటుందా? ఏమనుకుంటుంది? ఆ పిల్ల తనను బ్రతిమిలాడి ఇంటికి తీసుకొని వెళ్ళటానికి వచ్చాడూ అనుకొంటుంది, దాని తరువాత అందరితోనూ చెబుతుంది. నేను కోపం వచ్చి వెళ్ళిపోయాను. ఆయన స్టేషనుకు పరుగెత్తుకొనివచ్చి, బ్రతిమిలాడకపోతే వచ్చే దాన్ని కాను. అసలు ఆయన నన్ను వదిలి, క్షణం ఉండ లేరమ్మా అని అందరితోనూ చెప్పుకొంటుంది.

ఇదంతా ఆలోచించే శర్మ స్టేషనుకు పోవటం మాను కొన్నాడు. కాని ఆ అమ్మాయి ప్రయాణంలో నానా అవస్థా పడుతుంది; పడనీ దానికి అంతే కావాలె ఇల్లాంటి బుద్ధి తక్కువపని చేసినందుకు భర్తతో పోట్లాడి ఒంటరిగా ప్రయా

ణం చేయడం అంటే ఏమిటో తెలుస్తుంది, జానకికే కాదు, లోకానికంతా తెలియవలసిన విషయం ఇది! ఈమహోత్తర మైన నీతిని లోకం తెలుసుకోనేందుకైనా తాను ఆమెకు సాయం పోకూడదని శర్మ నిశ్చయించుకొని కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు.

శర్మనిద్రపోలేదు. అతనికివదోఆలోచనవచ్చింది చటు క్కునలేచి తలదువ్వుకొని పైన ఉత్తరీయం వేసుకొని పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ బజారుకు వెళ్ళాడు ఏంచేద్దా మనో ఏమో?

శర్మ చాలా చిరాకుగా ఉన్నాడు, ఎప్పుడూ నవ్వుతూ ఉండే ముఖం- ఆ రోజున ముడుచుకు పోయింది- అతనికి మనస్సులో చాలా కష్టంగా ఉంది. కళ్ళు ఏమీ కాంతివం తంగా లేవు, గంభీరంగా ముఖం పెట్టి చాలా తొందరగా నడిచి పోయినాడు.

వీధిలో అటూ ఇటూ చూడకుండా ఏదో చాలా అత్యవసరమైన పనిమీద వెళ్ళేవాడు లాగ నడిచాడు, అతని ముఖంలో ఏదోపట్టుదల కనపడుతున్నది. ఏదోఅఘాయిత్యం చేసేవాడులాగ ఉన్నాడు- ఎవడినైన కొడతాడో, చంపు తాడో! శర్మం ఏంచెయ్య దల్చుకొన్నాడో ఖర్మం!

అల్లాగ నడిచి వీధికొసను ఉన్న కాఫీహోటలులోకి విసురుగా వెళ్ళాడు- ఆ హోటలు యజమానిని కొట్టటానికి వెడుతున్నట్లు.

శర్మ హోటలులో ప్రవేశించి ఒక కొసను ఉన్న కుర్చీలో కూర్చున్నాడు—

క్రింద ఒక ఇత్తడిగ్లాసు పడేసిఉంటే దాన్ని ఓతన్ను తన్నాడు— ఇంకా ఎవరినైనా ఒకరిద్దరు మనుష్యులనే తన్నాలన్నంత కోపంగా ఉన్నది అతనికి. కానిపరిస్థితులు అనుకూలంగా లేవు—

అక్కడున్న కుఱ్ఱవాడు తెచ్చి యిచ్చిన కాఫీ చాలా వేడిగా ఉంది అయినా ఏమాత్రం లెక్కచేయకుండాఆకప్పు కాఫీని గుటుక్కు గుటుక్కున మింగేశాడు.

శర్మ వెంటనే బయటికివచ్చి ఓజట్కా బండిని పిలిచి స్టేషనుకు మాట్లాడి, ఎక్కికూర్చుని, పది గజాలు పోయిన తరువాత ఆపించి, దిగి, జట్కా పంపేశాడు! పాపం శర్మకు ఏమీ తోచటంలేదు— ఏదో బాధ పడుతున్నాడు.

ఆ తరువాత శర్మ బస్ స్టాండుకుపోయి బెజవాడ వైపుకు పోతున్న బస్‌లో ఎక్కి కూర్చున్నాడు— చాలా కోపంగా ఉన్నాడు.

ఏం జరిగిందీ అంటే, శర్మకు అసలు మొదట అంత కోపం రాలేదు జానకి వెళ్ళిపోయినందుకు. కాని కళ్ళు గట్టిగా మూసుకొని పడుకొన్నాడే, దాని తరువాతే అతనికి ఒళ్లు మండి పోయింది. ఎందుకంటే శర్మ కళ్ళుమూసుకొని నిద్ర పోలేదు. తీవ్రంగా ఆలోచించాడు జానకిచేసిన పనినిగురించి— ఆ అమ్మాయి కాస్త తగూ ఓ చిన్నవిషయంలో వచ్చినంత

మాత్రాన ఇల్లువాకిలీ వదలి ఇల్లాగ వెళ్ళిపోవటంచాలాతప్పు పని అనీ, ఆమెను తప్పక శిక్షించాలనీ అతనికితోచింది- అందుకనే ఇప్పుడు శర్మ బెజవాడ పోతున్నాడు-

శర్మ ఏమిచేయ దల్చుకొన్నాడో మనము ఊహించగలము-బెజవాడ వెళ్ళి జానకిని జుట్టుపట్టుకొని లాగి బండిలో పడేసి బందరు తీసుకొని రావాలనే నిశ్చయంతో ఉన్నాడని మాత్రం మనము ఊహించవచ్చు- మనిషికికోపంవస్తే ఎంత పని అయినా చేస్తాడు- ఎంత సాత్వికుడు అయినా కోపగ్రస్తుడు అయి పిచ్చివాడు అయిపోతాడు గదా!

శర్మ బెజవాడలో దిగి యకాయకీని అత్తగారింటికి వెళ్ళాడు. శర్మ అత్తగారు వీధి గుమ్మంలోనే కూర్చునిఉంది- ఆమె శర్మనుచూచి, దిగ్గునలేచి, కాళ్ళు కడుక్కోను నీళ్ళు యిచ్చి, ఏం, నాయనా, జానకి కులాసాగా ఉందా ? అని అడిగింది.

ఈ ప్రశ్న వినేసరికి శర్మకు పైప్రాణాలు పైనేపోయినవి- జానకి తల్లి దగ్గరకు వచ్చిఉన్నట్లయితే ఈ ప్రశ్న ఎందుకు వస్తుంది.

ఏమిటి ఖర్మం ? జానకి ఏమైనట్లు ? ఇలాగ అతడు ఆలోచిస్తూ నుంచునే సరికి ముసలమ్మకి ఆదుర్దా ఎక్కువ అయింది. ఏం నాయనా మాట్లాడవేం? జానకి కులాసాగా ఉందా? అని మళ్ళీ అడిగింది.

శర్మ తెప్పరిల్లి. 'అఁ కులాసాగానే ఉన్నది' అని చెప్పాడు కాని ముసలమ్మకు ఏమాత్రం తృప్తి కలగలేదు. లక్ష ప్రశ్నలడిగింది-అన్నిటికీ ఏవో పరధ్యానంగా జవాబులు చెప్పాడు శర్మ.

శర్మ తల గిఱ్ఱున తిరిగిపోతున్నది-జానకి ఏమైపోయి నట్లు? అప్పటికి ఆరున్నర అయింది-బందరులో రెండుగంట లకు బయలుదేరిన బండి గంటక్రితమే వచ్చి ఉండాలె మరి ఏమైనట్లు? శర్మకు ఏమీ తోచలేదు—

మనస్సు పరిపరి విధాల పోయింది-పొరపాటున ఇంకో బండి ఎక్కిందా? ఏ బండి ఎక్కుతుంది? బందరులో బయలుదేరేది ఒక బండేనాయె!

గుడివాడలో దిగి పొరపాటున భీమవరం బండి ఎక్కిందా? గుడివాడలో కూర్చున్న బండిలోనుంచి దిగటం ఎందుకు ఇంకో బండిలో ఎక్కడం ఎందుకూ? అఁహఁ అది కాదు—

అయితే ఏమైనట్లూ అని! ఏదో అఘాయిత్యంచేసి ఉంటుంది ఆ కోపంమీద!

శర్మ ఆలోచిస్తూ నుంచోటం చూచి ముసలమ్మ అప్పుడే గ్రహించింది ఏదో జరిగిందని. ఏం, నాయనా ఏమిటి సంగతి చెప్పు అని అదుర్దాగా అడిగింది.

శర్మకు గుండెలు కొట్టుకో సాగినవి—

ఏమని చెప్పాలె? "ఈ పూరే వస్తానని బందరులో రెండు గంటలబండి ఎక్కిందంటి—ఆవిడ రైలు ఎక్కింది.

నేనేమో బజారులో పనిచూచుకొని కారు ఎక్కి వచ్చాను— మరి ఎందుకు రాలేదో!" అన్నాడు శర్మ—

ముసలమ్మ ఈ మాటలు విని "అయ్యో, జానకీ, ఎక్కడికెళ్ళావే, నా తల్లీ, ఏమైపోయినావే" అంటూ గోలుగోలున ఏడవటం సాగించింది—

శర్మకు కూడా ఏడుపు వచ్చింది—ఏమైపోయింది జానకి? ప్రయాణంలో ఏదో ప్రమాదం సంభవించి ఉండా లనే ఇద్దరూ నిశ్చయించారు

శర్మకు కాళ్లు ఆడలేదు—వెంటనే బయలుదేరాడు అత్తగారు కూడా శర్మ వెంటనే వచ్చింది—ఇద్దరూ ఎనిమిది గంటల బండిలో బందరు బయలుదేరారు—ప్రతిస్టేషనులో అడిగారు. ఎవరైనా ఆడ మనిషి రైలులోనుంచి పడిపో యిందా అని? అటువంటిది ఎక్కడా జరగలేదు—

అయితే ఎండదెబ్బకు జట్కాలోనే పడిపోయి ఉంటుంది—వాడు తీసికెళ్ళి ఆసుపత్రిలో చేర్చి ఉంటాడు— ఎంత అవస్థ వచ్చింది!

"అది బయలుదేరి పోతున్నపుడు ఈ ఎండఏమిటి? పోవటం ఏమిటి? అని చీవాట్లు వేయాలిసిందిపోయి మెదల కుండా ఎందుకు ఊరుకొన్నావు నాయనా?" అని ముసలమ్మ శర్మను పొడిచిపొడిచి అడిగింది—శర్మ తాను పెళ్ళాన్ని కోప్పడకపోవటం తప్పేనని ఒప్పుకొన్నాడు—

అత్తగారూ అల్లుడూ బందరులో రైలు దిగి బండి కట్టించుకొని ఆసుపత్రికే వెళ్ళారు జానకి పేరుగల ఆడపిల్ల ఆసుపత్రిలో లేదు—అసలు ఎండ దెబ్బ తగిలి ఆ రోజున ఆసుపత్రికి వచ్చిన వాళ్ళుకూడా ఎవ్వరూ లేరు.

సరేనని బండి ఇంటికి తోలించారు. ఇంటిముందు దిగి, ముసలమ్మ ఏడుస్తూ ముందరా, వెనక శర్మా లోపలికి వెళ్ళారు.

జానకి పడక గదిలో ఉన్నదల్లా పరుగెత్తుకొనివచ్చి తల్లిని కౌగలించుకొని ఏడ్చింది. తల్లి ఎందుకో ఏడుస్తున్నదని ఏడ్చిందే కాని, అసలు సంగతి ఏమిటో ఆ పిల్లకూ తెలియాదు. ఆ పిల్ల ఏడుస్తూ ఏడుస్తూ ఇటు తిరిగి శర్మ ఏడ్వకపోవడంవల్ల కాస్త ధైర్యం కలిగి ఊరుకొన్నది.

దాని తరువాత జరిగిన కథ అంతా ఒకరి కొకరు చెప్పుకొన్నారు.

శర్మకుమటుకు ఒళ్ళు మండిపోయింది. జానకి వెడుతున్నానని చెప్పి రైలుకు వెళ్ళనేలేదని, మహిళామండలి సభకు వెళ్ళిందని తెలిసినపుడు!!

పైగా, నేను బెజవాడ వెడుతున్నానని మీాకు చెప్పానా, మీారు అల్లాగ ఎందుకు అనుకోవాలె! అని దీర్ఘాలు తీస్తూ మొగుడిని వెక్కిరించింది జానకి!

ఆ పిల్ల బెజవాడ వెడుతున్నదని ఎందుకు తోచిందో జ్ఞాపకం రాలేదు శర్మకు. అయితే భగటి, వెడుతున్నానండీ

అంటే, కోపంవచ్చి వెళ్ళేమనిషి తల్లిదగ్గరకు వెడుతుందని అనుకొంటారుగాని ఎవరైనా, మహిళామండలికి వెళ్ళుతుం దని అనుకోరుగద !

ఆ తరువాత ముసలమ్మ ఎదటే మొగుడూ పెళ్ళాం మళ్ళీ పోట్లాడుకొన్నారు. "నీవు నన్ను మోసపుచ్చావు, నన్ను అల్లరిపెట్టాలనే ఇల్లాగ చేశావు" అంటాడు శర్మ.

పెద్ద పోట్లాట ఏమీ లేదు. మంచంపైన దుప్పటి, అంచులు క్రిందికి జారేలాగున వేస్తే బాగుంటుందీ అని ఆయన అన్నారు. అంచులు క్రిందికి జారేలాగున ఎవ్వరూ వేసుకోరు పరుపుక్రిందికి అంచులు మడిస్తే బాగుంటుందీ అని నేను అన్నాను. ఈ విషయమై తగూవచ్చింది. నేను ప్రొద్దున దుప్పటి అంచులు మడిచివేశాను. ఆయన పనివేళావచ్చి, నాలుగు వైపులా క్రిందికి వ్రేలాడేలాగు లాగారు. నేను మళ్ళీ మడిచేశాను. ఆయన మళ్ళీ లాగారు. ఆయన లేన పుడు నేను దుప్పటి అంచులు మడిచివేయటం; నేను లేనప్పు డాయన లాగేయటం ఇట్లా జరిగింది.

చివరకు నేను మడుద్దామనీ, ఆయన లాగేద్దామనీ ఒకేసారి వచ్చాము. కాస్సేపు ఈ విషయమై పోట్లాడుకొ న్నాము. నాకు కోపంవచ్చినమాట నిజమేననుకో. అయినా నేను బెజవాడ వెళ్ళిపోతానని చెప్పలేదే ! అని జానకమ్మ తల్లితో చెప్పుకొన్నది.

శర్మా చెప్పాడు. ఊరుకొంటాడా ఏమిటి, అతను ప్రతి విషయంలోనూ ప్రతిఘటిస్తున్నది జానకి అని.

ఆ పూటకు ముసలమ్మ మడి కట్టుకొని ఇంత వండి అల్లుడికీ కూతురికీ పెట్టింది. తిన్నారు, వెళ్ళిపోయినారు

అన్నం తినేటప్పుడు నవ్వుకొంటూ సరదాగానే తిన్న వాళ్ళల్లా గదిలో చేరి మళ్ళా పోట్లాడు కొంటున్నారు! మళ్ళీ అదేవిషయం దుప్పటి అంచులు జారవిడిచి ఉంచాలా వద్దా అని!

"వీళ్ళ అమ్మ కడుపు బంగారంగానూ ఇట్లాగైతే ఎట్లా! అనుకొన్నది ముసలమ్మ పోట్లాట ఎంతసేపటికీ తెగేటట్లు లేదు.

ముసలమ్మ ఎట్లాగయినా అనుభవం గలది కాబట్టి వాళ్ళ ఇద్దరికీ ఒక విధంగా రాజీ కుదిర్చింది—జానకమ్మపడు కొనేవైపు దుప్పటి పరుపుక్రిందకు మడిచివేసేటట్లూ, శర్మ పడుకొనేవైపుమాత్రము దుప్పటి వ్రేలాడుతూ ఉండేటట్లూ ఒప్పందాలు అయినవి.

అంతటితో ఆ ఇద్దరూ పడి నిద్రపోయినారు ఆ రాత్రికి ఏ పోట్లాటా లేకుండా—

---

# "అనంగా, అనంగా"

"రాధిగాడిని కాస్త ఆడిస్తూ వుండండి. నేను ఇక్కడున్నట్లు వస్తాను" అని చెప్పి మా కాంతం పక్క ఇంటికి పేరంటానికి వెళ్ళింది పిల్లలను ఆడించటం అంటే నాకు చాలా సరదా. వాళ్ళకు కథలు చెప్పి కబుర్లుచెప్పి, లాలించి ఆడించ గలను.

రాధిగాడిని దగ్గర కూర్చోబెట్టుకొని కథ చెప్పటం మొదలు పెట్టాను. కథకు కథా నడవాలె. అందులో ఒక నీతి ఉండాలె. ఆనీతి వాళ్ళమనస్సుకు పట్టి వాళ్ళ భవిష్యత్ జీవితంలో ఆదర్శమై ఉండాలని నా కోరిక. కథ ఇల్లాగ నడిచింది.

"అనంగా, అనంగా ఒక గొల్లవాడు ఉండేవాడురా నాయనా"

"గొల్లవాడా?"

"ఆ గొల్లవాడు!"

"అంటే"

"అంటే గొర్రెలను కాస్తాడేవాడు"

"అహా"

"వాడికి ఓ కొడుకు. వాడిపేరు రామన్న"

"గొల్లవాడిపేరు రామన్నా?"

"గొల్లవాడిపేరు కాదురా. వాడి కొడుకు పేరు రామన్న"

"ఊఁ"

"ఒకరోజున గొల్లవాడు రామన్నను పిలిచాడు"

"ఎవరూ పిలిచిందీ?"

"గొల్లవాడు"

"ఎవరినీ?"

"రామన్నను"

"రామన్న ఎవరూ?"

"గొల్లవాడి కొడుకు"

"ఊఁహూ"

పిలిచి ఏమన్నాడు అంటే "నాయనా ఆ పొలంలో పనిచేస్తూ వుంటాను అని చెప్పేసరికి రాధాయ" ఏ పొలంలో అంటూ మళ్ళీ ప్రశ్న వేశాడు. కథ వినాలని వాడికి కుతూహలం కలిగినట్లు తెలుస్తునేవుంది. సంతోషమూ, ఉత్సాహమూ వాడికళ్ళల్లో మెర మెర మెరుస్తూ ఉన్నాయి. ఇంకొకరికైతే ఈ ప్రశ్నలవల్ల విసుగుపుట్టేదేమో కాని నేను మటుకు ఏమీ విసుక్కో లేదు. నాకు పిల్లలతో మాట్లాడటం తెలుసు. అందుకని చెప్పాను "దగ్గరేవున్న పొలంలో" అని. రాధాయి వూఁ కొట్టి తృప్తిపడ్డాడు.

"ఇంకా ఏం చెప్పాడంటే..." అని కథ ముందుకు నడిపించాను.

"ఎవరూ?"

"గొల్లవాడు"

"అంటే?"

"గొఱ్ఱెలను కాసేవాడు"

"గొఱ్ఱెలను కాసేవాడు చెప్పాడా? ఎవరితో?"

"రామన్నతో"

"రామన్న ఎవరూ?"

"గొల్లవాడి కొడుకు"

అప్పటికి మా అబ్బాయికి గొల్లవాడు ఎవరైంది ఎవరితో చెప్పిందీ తెలిసిందిగదా అని అనుకొని "నీవు ఈ గొఱ్ఱెలను చూస్తుండు. తోడేలుగాని పులిగాని వస్తే కేక వెయ్యి" అని చెప్పాడు అని ఆ వాక్యం పూర్తిచేశాను. రాఘాయ మళ్ళీ అడిగాడు.

"ఎవరూ ఇల్లా చెప్పిందీ?"

"గొల్లవాడు."

"ఏ గొల్లవాడూ?"

"రామన్న తండ్రి."

"రామన్న తండ్రి ఏమన్నాడూ?"

"రామన్నను గొఱ్ఱెలను కాస్త చూస్తూ వుండమన్నాడు."

"ఎందుకూ చూడటం?"

"ఎందుకా? వాటికేమీ అపాయం రాకుండా."

"ఏమిటి అపాయం?"

తోడేలు, పెద్దపులి అటువంటివి వచ్చి గొఱ్ఱెలను ఎత్తుకు పోతవి. అది అపాయం.

"ఎందుకూ ఎత్తుకుపోవటం ?"

"తింటానికి."

"తింటానికా ?"

ఆకలైతే తింటానికి. నీకు ఆకలైతే ఏమన్నా తినవూ ? అల్లాగే అవి గొర్రెలను తింటై.

రాధాయి అప్పటికి ఊఁ అని తల ఊపాడు. నేను ఓపికగానే ఉండదల్చుకొన్నాను. ఊరికే ప్రశ్నలు వేయకు. చెప్పేది విను అని కసరలేదు పిల్లవాడు ప్రశ్న వేస్తున్నాడూ అంటే అర్థం గ్రహిస్తున్నాడన్నమాట! కథను వాడు పూర్తిగా అర్థం చేసుకోవాలెననీ, దాని పరమార్థాన్ని వాడు గ్రహించాలని నా కోరిక. అందుకని వాడు వేసిన ప్రశ్నలకుఅన్నిటికీ ఎంతో ఓపికతో వాడికి జబాబు చెప్పాను. ఆకలైతే పులి గొర్రెలను తింటుంది. అని చెబితే వాడు ఇల్లాగ అడిగాడు.

"పులికి ఆకలైతే గొర్రెలను తింటుందా నాన్నా ?"

"ఆఁ తింటుంది."

"బాగుంటుందా నాన్నా."

"ఆఁ దానికి కమ్మగానే ఉంటుంది."

"అయితే నేనుకూడా తింటాను నాన్నా—"

ఛా, మనం తినకూడదు. పెద్దపులి, తోడేలు, అటువంటి జంతువులు తింటై గొర్రెలను.

"అట్లా చెప్పి రామన్న వెళ్ళిపోయినాడు—"

"ఆఁ"

వెళ్ళిపోయిన కాసేపటికి రామన్న పులి, పులి అని పెద్దగా అరిచాడు.

"అయ్యబాబో, పులి వచ్చిందా" ?

"రాలేదు."

"మరి ఎందుకు కేక వేశాడు."

"తమాషాకు."

రాధాయ ఇది విని నవ్వాడు కథ వాడికి స్పష్ట మయింది. నేను కథ ముందుకు నడిపించాను ఉత్సాహంతో.

అప్పుడు, రామన్నతండ్రీ, ఇంకా కొంతమందీ పరు గెత్తుకొని వచ్చారు హడావుడిగా!

"ఎందుకూ" ?

"పులివచ్చిందనుకొని".

"వచ్చిందా" ?

"రాలేదు."

"మరి ఎందుకొచ్చారూ" ?

"నిజంగా పులి వచ్చిందనుకొన్నారు."

"ఎందు కనుకొన్నారూ" ?

"రామన్న కేకేయలేదూ"

"ఏమనీ" ?

"పులి పులి అని".

"ఎందుకు కేక వేశాడూ" ?

"తమాషాకు అని చెప్పలేదురా"!

"ఊఁ కేకేస్తే"?

"అంతా వచ్చారు."

"వస్తే"?

"వచ్చిచూస్తే పులి లేదు."

"ఊ. లేకపోతే?

లేకపోయేసరికి, "పులి రాకపోతే ఎందుకు కేక వేశావు తప్పు. అబద్ధాలాడకు" అని విసుక్కుని వెళ్ళిపోయారు. "తెలిసిందా?" అని అడిగాను ఆ అని తల ఊపాడు రాధి గాడు. వాడికి కథ తెలిసిందో లేదో తెలుసుకొందామని ఒక చిన్న ప్రశ్న అడిగాను.

"ఎవరూ విసుక్కున్నది?

"రామన్న"

ఛా రామన్న ఎందుకు విసుక్కున్నాడురా?

"పులి ఎంతసేపటికి రానందుకు"?

ఛాఛాఛా. అది కాదురా రామన్న తండ్రీ వాళ్ళూ విసుక్కున్నారు.

"ఎందుకూ"?

పులి గిలీ ఏమీరాందే అనవసరంగా కేక వేసినందుకు.

రాధాయకు అర్థమైనట్టు తలఊపాడు. కథ ఇల్లాగ చెప్పాను మళ్ళీ గొల్లవాడూ వాళ్లూ వెళ్ళిపోయిన తరువాత కాసేపు ఉండి రామన్న మళ్ళీ కేకేశాడు "పులి పులి"అని

"ఎవరూ?"

"రామన్న"

"ఎందుకూ కేకేసిందీ?"

"మళ్ళీ తమాషాకే!!"

ఈమాట విని రాధాయి పకపకా నవ్వాడు. తమాషాకు పులి పులి అని కేక వేయుటం వాడికి వినోదంగా వుండి వుంటుంది. నవ్వి కథ చెప్పమన్నట్టూ ఊ అని తల ఊపాడు.

మళ్ళీ, గొల్లవాడూ, ఆ పొలంలో ఉన్నవాళ్ళూ, అంతా వచ్చారు కర్రలూ గొడ్డళ్ళూ, కత్తులూ పుచ్చుకొని.

ఎందుకూ? అని అడిగాడు రాధాయి బిత్తరపోయి చూస్తూ, ఎందుకేమిటిరా? రామన్న పులి పులి అని కేక వేయలా?

"ఆ వేశాడు."

"ఆ కేక విని నిజంగా పులి వచ్చిందీ అనుకొన్నారు?

"వచ్చిందా?"

"రాలేదు."

"రాకపోతే?"

రాకపోతే ఎందుకు కేక వేశావురా అని వాడిని మళ్ళీ కోపపడి వాళ్ళంతా వెళ్ళిపోయినారు?

"ఎందుకు వెళ్ళిపోయినారు?"

'పులి రాలేదుగా."

"ఎందుకు రాలేదూ?"

ఎందుకు రాలేదేమిటిరా? అప్పటికిరాలేదు. అంతే అన్నాను. రాధిగాడు ఏదో సందేహంగా చూశాడు. పులి ఎందుకు రాలేదా అని కాదూలు వాడి సందేహం. నాలో నేను నవ్వుకొని కథసాగించాను. అరేయి అప్పుడేమైందో కథ విను.

"ఆ"

"దానితరువాత కాసేపటికల్లానిజంగా పులివచ్చింది"

"పెద్ద పులా?

"ఆ."

అమ్మయ్యో, ఎట్లా వచ్చిందినాన్నా.

"అడవిలోనుంచి గాండ్రు గాండ్రుమని అరుస్తూ వచ్చింది"

"భయంవేయలేదూ?"

"వేసింది."

"వస్తే?"

"వస్తే పెద్దగా కేకలు పెట్టాడు పులి పులి అని."

"ఎందుకూ?"

"భయంవేసి."

"ఊఁ."

"ఎన్ని కేకలు వేసినా తండ్రీ వాళ్ళూ రాలేదు."

"భయం వేసింది అని కలిపాడు మా రాధాయు.

"ఎవరికిరా?" అని అడిగాను."

వాళ్ళకే!

ఛాఛా అదిగాదు. భయంవేసి కాదూ వాళ్ళు రాక పోవటం! ఇదివరకులాగా తమషాకు రామన్న కేక వేస్తున్నా డను కొన్నారు.

ఊఁ అని రాధాయి బిక్కముఖం వేశాడు.

పులి వచ్చి, రెండు గొర్రెలను ఎత్తుకెళ్ళింది.

ఎక్కడికి.

అడవిలోకి,

ఎందుకూ?

తింటానికి,

ఊఁ.

ఆ తరువాత గొల్లవాడువచ్చి చూచి ఏడ్చాడు.

ఎందుకు ఏడ్చాడూ?

ఖరీదుగల గొర్రెలు పోయినందుకు.

గొర్రెలు ఏమైపోయినై.

ఆ పులి తినేసింది, రామన్న అయ్యో, నా గొర్రెలు పోయినాయి అయ్యో అని ఏడ్చాడు. చూశావా అబద్ధం ఆడుటవల్ల ఎంత నష్టమో అని పూర్తిచేశాను కథ.



ఇంతలోకే కాంతం పేరంటానికి వెళ్ళివచ్చి, అన్నం పెడతా రా నాన్నా అంటూ రాధాయిని తీసికెళ్ళింది.

అమ్మా, నాన్న మంచి కథ చెప్పారే.

ఏం కథ నాయనా నాకు చెప్పు వింటాను. అన్నది ఆవిడ.

అది కాదే అమ్మ! గొర్రెలున్నాయటే, ఉంటే రామన్నా...

"రామన్న ఎవర్రా నాయినా!"

"గొర్రెలను కాసే గొల్లవాడి తండ్రి!"

ఆ అయితే...

రామన్న పొలానికి పోయినాడట, వెడితే గొల్ల వాడికి ఆకలైంది. అయితే గొర్రెలను తిందామనుకొన్నాడు గొర్రెలను చంపద్దూ తింటానికి? అందుకని గొర్రెలను చంప టానికి పులిని రమ్మన్నాడట. ఆ పులి ఎంత సేపటికి. రాలేదు. పులీ, పులీ, అని కేకేశాడు; ఎందుకు అట్లాగ కేక వేస్తావు అని తండ్రి కోప్పడ్డాడట. చివరకు పులి మెల్లగా వచ్చేసి రెండుగొర్రెలను తీసుకొని అడవిలోకి వెళ్ళిపోయింది: గొల్లవాడు పులీ, గొర్రెలనుతిన్నారు. రామన్న ఎడ్చాడట!

ఎందుకురా?

వాడికి లేకుండా తిన్నారని కాబోలు—

ఈ కథ వింటూ వరాండాలో ఉన్న నేను, వంట ఇంట్లోవున్న కాంతం ఒక్కసారే నవ్వాము—

---

[5]

# సుందరం భార్య

నాకు సుందరాన్ని చూస్తే కోపము. ఎన్నిసార్లని చెప్పేది, మాట వినేరకం అయితే అనుకోవచ్చు. ఎబ్బే! ఈ రకం మనుష్యులను బాగుచేయలేము.

వచ్చి ఎదురుగా కూర్చున్నాడు. తీరా అతన్ని చూచే టప్పటికి జాలివేసింది, ఈ తడవ కూడా గట్టిగా చెప్పి చూస్తాను. ఇదే ఆకరి సారి కూడాను. వింటాడా సరే, సరి వినడూ, ఇక వాడి కర్మానికి వాడిని వదిలేసి ఊరుకొం టాను. ఇల్లా అనుకొని "ఏమోయ్—ఏమంటున్నది మీ ఆవిడ" అని పలకరించాను.

సుందరం నవ్వి ఊరుకొన్నాడు.

"నీవు ఏమీ మారినట్లులేదే!"

ఏమన్నా జవాబు ఇస్తా డనుకొన్నాను. అతనేమీ మాట్లాడక నవ్వి, తల వంచుకొని ఊరుకొన్నాడు.

"ఒరేయ్ వాజమ్మా! ఇంకా ఎన్నాళ్ళు చెప్పాలె నీకు భార్యమీద శాస్త్ర అధికారం చెలాయించాలని? తోడి వాళ్ళను చూచి అయినా నేర్చుకోరాదూ! నీవు ఇల్లాగ అయిపోవటం నాకు తలవంపుగా ఉంది. నాకేమిటి! మొగ జాతికే తలవంపుగా ఉంది!" అన్నాను మావాడితో.

మావాడు అంటే, ఈ సుందరం నాకేమీ బంధువు గాడు. ఒక విధంగా శిష్యప్రాయుడు, నాకంటే వయస్సులో

చాలా చిన్నవాడు. భార్య కాపరానికి వచ్చి మూడేండ్లు అయింది. ఒక ఆడపిల్ల.

సుందరం వట్టి వెర్రిబాగులవాడు. ఆ పెళ్ళాం ఎంత చెపితే అంత! ఆ అమ్మాయి చెప్పినట్లు వింటూ, ఆవిడకు సాహాయ్యంగా అన్నిపనులూ చేస్తూ ఉంటాడట! ఆడ వాళ్ళంతా చెప్పుకొని ఊహాలు నవ్వు కొంటూ ఉంటారు. సుందరం సంగతి ఇల్లా ఉందని మా ఆవిడ చెబితే విని, నేనూ ఎంతో నొచ్చుకొని వాడిని కాస్త మంచిదారిలో పెడదా మని ప్రయత్నం చేస్తున్నాను. అందుకనే అంత గట్టిగా కోపడ్డాను నేను కోప్పడితే వాడు ఏమీ అనుకోలేదు. జాలిగా చూస్తూ "నన్ను ఏంజేయమంటావు"— అని అడిగాడు.

"నా బొంద; నీకు ఎన్నిసార్లు చెప్పానురా, భార్య ఎదట కాస్త దర్జాచూపమని?"— అన్నాను.

"దర్జాచూపటం అంటే ఏమిటో నాకు బొత్తిగా తెలి యదు"—అన్నాడు సుందరం దీనంగా.

నాకు వాడిమీద జాలికలిగింది. చిన్నతనం! తెలి యదు! నలుగురి నోళ్ళల్లోపడి నవ్వులపాలు కాకుండా, వాడికి కొన్ని చిన్న చిన్న విషయాలు చెప్పటం అవసరం అని తోచింది.

"చూడూ, ఒకేయ్ అయితే చెబుతాను విను. ఇప్పుడు ఏదైనా పని కావాలనుకో. ఆవిడకు చెప్పి చెయ్య మని, అంతేగాని నీవు స్వయంగా చెయ్యబోకు"-అన్నాను.

ఇట్లా సూత్రప్రాయంగా, ధర్మనిర్వచనం చేస్తేవాడి కేమీ అర్థమైనట్టులేదు. ఏదో బిక్కముఖంపెట్టి అల్లాగే కూర్చున్నాడు. విపులంగా చెప్పాలన్న ఉద్దేశంతో నేను మళ్ళీ ఇట్లా అన్నాను

"మంచినీళ్ళు కావాలె అనుకో నీవే వంటయింట్లోకి వెళ్ళి చెంబు వెతుక్కొని నీళ్లు ముంచుకొని తెచ్చుకోకూడదు"........వీధివసారాలో కూర్చుని "ఏయ్, మంచి నీళ్ళుకావాలె, చప్పున తీసుకురా!" అనాలె!

"ఆవిడ తీసుకొనిరాకపోతే?" అని అడిగాడు సుందరం ఇంత వెర్రివాడేం వీడు!

"ఎందుకు తీసుకురాదురా! తప్పకుండా తీసుకొస్తుంది నీవు అడగడంలో ఉంది! అంతగా తీసుకురాకపోతే, కొంచెం కోపం నటిస్తూ, "ఏయ్ ఏమిటదీ, నీకుగాదూ, చెపటం? మంచినీళ్ళు కావాలె! ఏంచేస్తున్నావ్" అని అనాలె, తెలిసిందా! అన్నాను తెలిసిందని తలఊపాడు సుందరం.

"బట్ట కట్టుకొని బైటికి వెళ్ళాలనుంటావు. నీవే దర్జాగా వెళ్ళి, పెట్టె తీసుకొని బట్టలు తీసుకోకూడదు. స్నానం చేసినతరువాత దర్జాగా ఠీవిగా అనాలె, "ఏమెయ్ బట్టలుతీసి ఇయ్యి" అని

"ఆవిడ ఏదైనా పనిమీద ఉండి తొందరగా రాక పోతే, "ఏమిటా ఆలస్యం' వెళ్ళాలినేను" అని కాస్త కేకవె

య్యాలె." అనికూడా చెప్పేను. వాడు తెలిసినట్టు తలఊపాడు కాని ఏదో అడగాలని అడగలేక బాధపడుతున్నట్లు నాకుతోచి "సందేహము ఏమున్నా ఉంటే అడగరా" అన్నాను.

వాడు ఇంకా సందేహిస్తూనే అడిగాడు "స్నానానికి నీళ్ళు ఆవిడనే తోడమనాలా?" అని.

"అవును. ఎందుకూసందేహం?" అన్నాను.

"బావి చాలాలోతు, ఆవిడతోడటం కష్టం. అందుకని..." అన్నాడు ఏదో సిగ్గుపడుతూ.

"కొన్నాళ్ళదాకా అల్లాంటి భావాలు పెట్టుకోబోకు, అంతగా అయితే పనిమనిషి చేత తోడించమను, అంతేగాని నీవుమటుకు తోడబోకు" అని చెప్పాను.

"సరే ఆ పనిచేయిస్తా" అని తనకున్న ఒక్కసందేహమూ తీరిపోయినట్టు సంతోషించాడు సుందరం.

సంతోషించాడు కాని ఇంకా ఆలోచిస్తూ ఉండటం చూచి నేనన్నాను "ఒరేయ్, భయంలేదు. ఏవిషయంలోనైనా సరే, ఏమాత్రం సందేహం ఉన్నాసరే నన్నడుగు. చూచినవాళ్ళంతా ఫలానివారి స్నేహితుడు పెళ్ళానికి భయపడుతున్నాడని చెప్పుకోటం నాకు తలవంపులుగా ఉంది. పదిమందిలో నిన్ను మనిషిగా నిలబెడదామని నా ఉద్దేశం."

ఈ మాటలు విని మావాడు చాలా సంతోషించి కృతజ్ఞత చిలుకుతున్న చూపుల చూశాడు.

అయినా వాడికి ఇంకా ఏవో సందేహాలు బాధిస్తూనే ఉన్నట్లు ఉన్నాయి. వాడిముఖమే చెపుతున్నది ఆ విషయం. వాడికి మంచి ప్రోత్సాహము ఇయ్యాలన్న సంకల్పంతో నేనే అడిగాను. "తమలపాకులు వేసుకొంటారా మీరూ?" అని. "ఆ రెండు పూటలా వేసుకొంటాము" అన్నాడు. "అయితే మీ ఆవిడే నీకు తమలపాకులు ఇస్తుందా?" అని అడిగాను.

వాడు తల అడ్డంగా తిప్పుతూ చెప్పుకొన్నాడు, "ఊఁహూ. ఆవిడా నేనూ, ఒకసారే భోజనంచేస్తాము. ఆవిడ ఇల్లు సర్దుకు వచ్చేలోపున నేను తమలపాకులకు సున్నం రాచి, చుట్టి ఉంచుతాను. ఆవిడవచ్చిన తరువాత ఇద్దరం కలిసి వేసుకొంటాము"

నేను వాడికి విప్పిచెప్పాను ఇల్లాగ, "అల్లా కాదురా! నేను చెప్పినట్లు చెయ్యి; భోజనం చేసివచ్చి పడకకుర్చీలో హాయిగా పడుకో. ఆవిడగారు వచ్చిందాకా, ఆవిడ వచ్చిన తరువాత తమలపాకులు చుట్టి ఇయ్యమని అడుగు; ఆమె గారే సున్నంరాచి, ఈనెలుతీసి చిలకలు చుట్టి ఇస్తే నీవు వేసుకోవాలె. ఈమాత్రం తెలియదురా నీకు! నీకు ఎన్నని చెప్పేది?" అని విసుక్కున్నాను.

"ఇంకెందుకూ ఇక తెలిసింది" అని చెప్పి సుందరం లేచి గబ గబా నడచి వెళ్ళిపోయినాడు.

౨

ఆ తరువాత నాలుగు రోజులు గడిచింది. వాడు మాయింటి ఛాయల రాలేదు ఏమి జరుగుతున్నదో ఎట్లా ఉన్నాడో చూద్దామని వెళ్ళాను, నేనే వాళ్ళయింటికి.

వీధితలుపు వేసిఉన్నది. లోపల ఏదో చాలా గొడవ జరుగుతున్నది; నేను ఆ వరాండాలోనే నుంచుని విన్నాను.

వాడిపెళ్ళాం అంటున్నది.........."మరీ ఇల్లాగ తయారైనారేం అమ్మా! కాస్తవేదైనా సహాయ్యంచేయండీ అంటే, ఊఁహు అని మూతి బిగించుకొని కూర్చుంటున్నారు; నేను ఒక్కదాన్నీ ఎంతని సద్దుకుపోనూ ఆడపనీ, మొగపనీ కూడా! కాస్త లేవండి"—

సుందరం ఏమీ మాట్లాడటం లేదు. ఆవిడ ఎన్ని కేకలువేసినా వీడు మాట్లాడక ఊరుకొంటున్నాడు.

ఆ అమ్మాయి మళ్ళీ అంటున్నది..."లేవండి. నా మాట వినండి. బొమ్మలన్నీ తీసి బైటపెట్టాను. కాస్తగుడ్డతో తుడిచి బల్లమీదపెట్టండి. అట్లా భీష్మించుకు కూర్చుంటే ఎల్లాగ చెప్పండి. బొమ్మలన్నీ పెడితే చూచి అమ్మాయి ఎంత సంతోషిస్తుంది చెప్పండి !"

"ఇటువంటి పనులు నావల్ల కాదు"—అని నిష్కర్షగా అన్నాడు సుందరం.

"ఎటువంటి పనులు మీవలన అవుతయ్యి ?" అని అడిగింది ఆ పిల్ల.

"నాపని అల్లా ఇంత సంపాదించి తెచ్చిపడెయ్యటమే. ఆ తరువాత సంసారం జరిపే బాధ్యత అంతా నీదే" అని అనేశాడు సుందరం.

"ఈ బొమ్మలు సద్దాలె! అవతల వంటపని చూచుకోవాలె! పిల్లను సద్దుకోవాలె! ఇవన్నీ నేను ఒక్కదాన్నే చేయగలనా? మీరు నాకు కాస్త సాయపడకూడదూ?" అన్నది ఆ అమ్మాయి.

"ఇన్నాళ్ళనుంచీ అల్లాగ అనుకొనే నెత్తిమీదికి తెచ్చుకొన్నాను. అందరూ నన్నుజూచి నవ్వుతున్నారట!" అన్నాడు.

"అవ్వ! ఎక్కడన్నా ఉందా, ఇంత అన్యాయం! సంసారంలో మొగుడికి, పెళ్ళామూ పెళ్ళానికి మొగుడూ సాయంచేసుకోట తప్పని ఎవరండీ మీకు చెప్పింది? నాదగ్గరకు తీసుకురండి, చెప్తా!"

"అవసరమైతే అల్లాగే తీసుకొస్తాను. కాని ఇప్పుడు... ఆ బొమ్మలు తుడవటం, అల్లాంటి పనులేమీ నేను చెయ్యను"

సుందరం నా సలహాను అనుసరించాడు కాని చాలా దూరం పోయినాడు. మళ్ళీ వెనక్కు త్రిప్పుకురావటం కష్టము!

ఇంతలో సుందరం వీధితలుపు తీసుకొనివచ్చి నన్నుజూచి, చాలా ఖంగారుపడి తెప్పరిల్లి, లోపలకు రమ్మనిపిలి

చాడు. "వస్తానుగాని...ఏమింటి సంగతి ఏదో గొడవ జరుగు తున్నది ?" అని అడిగాను

"గొడవేమీ లేదు గాని...మీరు లోపలికిరండి, వచ్చి మా మనిషితో కాస్త చెప్పండి" అని దీనంగా అడిగాడు.

"ఏం చెప్పేదోయ్ ?" అన్నాను.

సుందరం తలవంచుకొనే జబాబు ఇచ్చాడు.

"ఏం లేదూ, నాకు చెప్పినట్లుగానే ఆమెకు కూడా చెప్పండి...భర్త చేత, భార్య ఏమీపనులు చేయించకూడ దనీ, అల్లాగ చేస్తే పాపమనీ—ఇల్లాంటి విషయాలు"

"అల్లాగే చెబుతాను" అని లోపలికి వెళ్ళాను. సుందరం భార్యను కేకవేసి, నేను ఎవరైంది ఆ అమ్మాయికి చెప్పాడు.

నేను ఎవరైంది సుందరం చెప్పగానే "ఓహో ! రండి బాబాయిగారూ" అంటూ పిలిచింది ఆ అమ్మాయి.

కూర్చుంటానికి అక్కడేమీ లేదు. ఆ ఉన్న ఒక్క కుర్చీ, ఎందుకో స్నానాలగదిలోకి పోయింది.

"కుర్చీ ఏదండీ ?" అంటూ ఆ అమ్మాయి అటూ ఇటూ తిరుగుతూఉంటే "ఎందుకులేఅమ్మాఇక్కడ కూర్చుం టాను" అంటూ నేనే మూలనున్న చాప తీసుకొచ్చి, వేసు కొని కూర్చున్నాను. సుందరంగబగబా వెళ్ళి కుర్చీ తెచ్చాడు నేను చాపమీదే కూర్చున్నాను.

ఆ అమ్మాయి అయినా నాకేమీ కొత్త పిల్ల కాదు. ఆ అమ్మాయి తల్లి తండ్రులూ, మేమూ గుంటూరులో ఒక ఇంట్లోనే ఉండేవాళ్ళం. అప్పటికి ఈ అమ్మాయి బొత్తిగా పసిపిల్ల. ఈ సంగతులు ఆ అమ్మాయికి చెప్పాను. ఆ అమ్మాయి ఎక్కువగా సంతోషించి నాతో, తండ్రితో మాట్లాడినట్లు చనువుగా మాట్లాడింది.

"చూచావా బాబాయి, పిల్ల బొమ్మలు పెట్టుకొని ఒక్క తీరానగోలచేస్తున్నది. బొమ్మలన్నీతీసి బైటపెట్టాను. ఇవి కాస్త తుడిచి ఆ బల్లమీద పెట్టకూడదూ! నేను వంట పనే చూచుకొనేదా, ఈ పనే చూచేదా! కాస్త సాహాయ్యం చేయమంటే, ఆయన నసేమిరా అని కుర్చీలో పడుకొని లేవటంలేదు. ఇంత అన్యాయం ఎక్కడైనా ఉందా? ఇంటి పనులు చేసుకొంటే, ఎవరో నవ్వుతారట! విన్నావా బాబాయి!" అని నావంక చూచింది జవాబుచెప్పమన్నట్లు.

"ఎందుకు నవ్వుతారమ్మా. ఎవరింటిపని వాళ్ళు చేసుకొంటే తప్పేముంది!—" అని అనాలిసి వచ్చింది నేను.

ఈ మాటలు విని సంతోషించి ఆ అమ్మాయిఅన్నదీ, "కాస్త ఆ మాట ఆయనకు చెప్పు బాబాయి!"

"చెప్పేదేమిటిలేఅమ్మా వింటున్నాడుగా!" అన్నాను.

"అయితే ఇవన్నీ నేను ఒక్కదాన్ని చేస్తూ కూర్చుంటే వంట ఎవ్వరు చేస్తారు? ఎవరైనా పెద్దవాళ్ళు

ఉన్నారు గనకనా! మొగవాళ్ళయితే నిమిషంలోకి చేశే స్తారు. చూడు బాబాయి ఆయన లేస్తారేమో!'' అన్నది.

నాకు జాలేసింది. నే నన్నాను ''నే సాయం చేస్తాలే అమ్మా. నీవు వెళ్ళి వంట పని చూచుకో.'' ఆ అమ్మాయి సంతోషంతో అన్నది ''మీరు ఈ పూట ఇక్కడే భోజనం చెయ్యాలె. నేను నిమిషంలోకి వంట పూర్తిచేస్తాను.''

వెళ్ళమ్మా, నీవు వెళ్ళు. ''ఈ పని మే మిద్దరం చూస్తాంలే'' అన్నాను నేను.

ఆ అమ్మాయి స్నానానికి లెమ్మనే లోపున మేము ఇద్దరం కలిసి, బొమ్మలన్నీ తడిచి బల్లపైని చక్కగా పెట్టాము.

ఆ తరువాత స్నానంచేసి భోజనం చేశాము. తమల పాకులు వక్కలు తెచ్చి అక్కడ పెట్టింది సుందరం పెళ్ళాం.

''ఏయ్ నీవువచ్చి, ఆకులకు సున్నంరాచి చిలకలు చుట్టి ఇయ్యి'' అని దర్జాగా అన్నాడు సుందరం.

' చెయ్యి ఊరుకోలేదండీ. పిల్లదానికి అన్నం పెడు తున్నా'' అన్నది ఆవిడ లోపలఉండే!

''ఎందుకోయి ఈ మాత్రంపనికి ఆ అమ్మాయిని పిలు స్తావు?'' అంటూ నేను వక్కలు నోట్లో వేసుకొని ఆకులకు సున్నం రాచుకొన్నాను. సుందరంకూడా ఆ పనే చేశాడు.

ఇంతలో వాడి భార్యకూడా భోజనంచేసి పిల్లనెత్తు కొని వచ్చి మాకు ఎదురుగా నిలబడ్డది.

"భోజనం చేశావా అమ్మా?" అని అడిగాను. "చేశాను బాబాయి పిల్ల ఏడుస్తున్నది. దాన్ని నిద్ర పుచ్చాలె" అన్నది. ఆ అమ్మాయి ఆ తరువాత నాతో అన్నది; "ఈ నవారుమంచం చూశావా బాబాయ్. ఇది తెగిపోయింది. కుక్కి అయి పోయింది. నాలుగు రోజులనుంచీ నత్తిని నోరు పెట్టుకొని అరుస్తున్నాను దీనిని కాస్త విప్పి అల్లండీ అని; వింటేనా? పనిది చంక దిగదు దానికోసం ఓ దాసీదాన్ని పెడితే, సంసారం గడుస్తుందా? ఏమంటావ్ బాబాయి, మన పని మనం జేసుకోవాలె అవునా?"

"అవును, అవును" అని నేను తల ఊపాను

"ఇది ఏమంత కష్టమైనపని! అయిదు నిమిషాలలో అయిపోతుంది!"

ఇల్లా అంటూ ఆ అమ్మాయి మంచాన్ని విప్పింది

"రండి,మీా ఇద్దరూ కూర్చుంటే నిమిషంలో అయి పోతుంది" అని భర్తవంక చూచింది; నేను ముందు వెళ్ళి అక్కడ కూర్చుని సుందరాన్ని రమ్మన్నాను; తెగిపోయిన నవారంతా కుట్టి, సాయంత్రం నాలుగు గంటలకల్లా మంచం అల్లేశాము. ఆ అమ్మాయివచ్చి చూచి సంతోషించి, "చూడు బాబాయి ఎంతలోకి అయిపోయిందో" అని నాతో అని, "అవతల వాళ్ళను చూచిఅయినా నేర్చు కోవాలె" అని భర్తతో అన్నది దీర్ఘాలు తీస్తూ, మేము ఇద్దరం నవ్వి ఊరుకొన్నాము.

ఆ తరువాత మాకు కాఫీ ఇచ్చింది ఆ అమ్మాయి; ఇద్దరం పుచ్చుకొన్నాము.

నేను లేచి "ఇక వస్తానమ్మా" అన్నాను.

"ఇల్లంతా చూశావా బాబాయి – ఇది పడకగది; ఇది హాలు; వంట ఇల్లు చూశావుగా! ఇది స్నానసాలగది" అంటూ అన్నీ చూపించింది.

"బాగుందమ్మా అంతా సౌఖ్యంగా ఉంది అన్నాను నేను.

"అన్నీ బాగానే ఉన్నాయి కాని ఈ రోలు వంట ఇంట్లో ఉంటే ఎంతో బాగుండేది; ఇక్కడ వేశారు! వర్షం వస్తుందనుకోండి, అప్పుడు నాకెంత కష్టం! వర్షంలో తడుస్తూ పచ్చడి నూరుకోవాలె; ఏమంటావు బాబాయి! నేను అన్నమాట నిజం అంటావా కాదా?" అని అడిగింది.

"నిజమేనమ్మా" అన్నాను నేను;

"నిన్నటినుంచిగోలపెడుతున్నా. ఆయనతలకెక్కించు కోటంలేదు బాబాయి; కాస్త లోపల వేసి పెట్టరూ?" అని నవ్వుతూ అడిగింది నేను కాదనలేక పోయినాను.

నేను ఒకణ్ణె ఆ రోలు ఎత్తి ఎట్లాగో అవస్థపడి వంట ఇంట్లోకి చేర్చాను; సుందరం నవ్వుతూ నుంచున్నాడు.

నేను వెళ్ళటానికి సిద్ధమైనాను; చెప్పులు తొడుక్కొని కర్ర తీసుకొని గడప దాటుతూఉంటే ఆ అమ్మాయి అన్నది "ఎప్పుడన్నా వస్తూఉండు బాబాయి ఈ యన సంగతి ఏమిా

బాగా లేదు. పూర్వం అన్ని విషయాలలోనూ ఎంచక్కా సాయం చేస్తుండేవారు. నాలుగు రోజులనుంచీ భీష్మించుకు కూర్చుంటున్నారు. ఏమన్నా శాస్త్ర సాహాయ్యం చేయమంటే చేయనని! ఎల్లాగ గడుస్తుంది ఒంటరి సంసారంలో! నిజమా అబద్ధమా బాబాయి?'' అని అడిగింది.

''నిజమేనమ్మా, సంసారంలో ఒకరికొకరు సాయం చేసుకోపోతే ఎట్లాగూ?'' అన్నాను. ఆ అమ్మాయి నాకు దగ్గరకు వచ్చి ''ఈ సంగతి విన్నావా బాబాయి! ఇంట్లో పనులు చేసుకుంటేనట ఎవ్వరో నవ్విపోతున్నారట! అన్నది.

''ఏడిశాడులే! ఎవరమ్మా నవ్వేది?'' అన్నాను నేను.

''చెప్పు బాబాయి ఆయనతో శాస్త్ర చెప్పు'' అన్నది.

''చెపుతానమ్మా, నేను తప్పకుండా చెబుతాను'' అని రోడ్డుమీదికి వచ్చేశాను. సుందరంకూడా బట్టలు వేసుకొని నాతో రావటానికి బయలుదేరాడు. వాడిభార్య వీధి వాకిట్లో పిల్లను ఎత్తుకొని నుంచుని భర్తను ఉద్దేశించి, ''ఏమండోయ్ మీరు బాబాయితో కలిసి షికారు వెడితే కాదు. ఇట్లా రైలు స్టేషను వైపుకు వెళ్ళి ఒక బండి కేకేసుకు రండి. నేను నాయుడుగారి భార్యను కలుపుకొని

సినిమాకు వెడదామనుకొంటూన్నాను'' అన్నది. సుందరం నావంక చూశాడు నవ్వుతూ నేను, ''వెళ్ళవోయ్ వెళ్ళు. నేను ఇట్లా వెడతాను' అని చెప్పి ఇంటిదారి పట్టాను, ఆ అమ్మాయి, నామాటలూ, విన్నది. మొగుడు గిరుక్కున రైలు స్టేషను రోడ్డుకు తిరగటమూ చూచింది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

---

# ప్రాయశ్చిత్తం

సుందరరావు అంత ఆలస్యంగా ఎప్పుడూ ఇంటికిరా లేదు.

ఆ రోజు రాక తప్పిందికాదు. కలెక్టరుగారు ఆఫీసు విషయాలు మాట్లాడుతూ చాలా సేపు ఉంచారు.

ఇంటిదగ్గర భార్య ఒంటరిగా ఉంటుందనీ తనరాక కోసం నిరీక్షిస్తూ ఉంటుందనీ సుందరరావుకు తోచకపోలేదు. కాని ఏం చేస్తాడు! పెద్ద అధికారితో ఈ మాట చెపటం కూడా అంత సభ్యమైన విషయం కాదు. చివరకు రాత్రిపది గంటల బండి అందుకోగలిగాడు. నరసారావుపేటలో దిగేస రికి పన్నెండు గంటలు అయింది. జట్కాబళ్ళు ఉన్నవి. కాని ఊళ్ళోకి మనిషికి ఒకరూపా యి అడిగాడు. గుంటూరునుంచి నరసారావుపేట రావటానికే రూపాయి కాలేదు. స్టేషను నుంచి ఊళ్ళోకి రూపాయి ఇయ్యటం చాలా ఎక్కువ అని పించింది.

నెలకు అరవయ్యో డెబ్భయ్యో సంపాదిస్తున్న కలూకా గుమాస్తా జట్కాకు రూపాయి యిస్తే, ఇక సం సారం గడిచినట్లే! అందుకని సుందరం, పాపం, కాళ్ళీడ్చు కొంటూ తన ఇంటికి ఆ మైలు దూరం నడిచే వెళ్ళాడు.

ఆరోజు సుందరం మనస్సు ఏమీ బాగుండలేదు. పాపిష్టి మనస్సు, ఏవేవో ఊహాలు అతని మనస్సు చుట్టూ

ఝుంకారాలు చేసినవి, భార్యను గురించి విపరీతమైన భయాలు అతన్ని చుట్టుకొన్నాయి.

పాపం, ఆపిల్ల కాపరానికి వచ్చి ఎన్నో రోజులు కాలేదు. ఆ అమ్మాయిని గురించి ఇతడు ఇల్లా దరిద్రపు ఆలోచనలు చేస్తున్నాడు ఆ ఈడులోఉన్న కుఱ్ఱవాళ్ళకు అల్లాంటి ఆలోచనలు రావటమో, లేకపోతే ఈ సుందరం మనస్సుకు ఇది ప్రత్యేక లక్షణమో నేను చెప్పలేను. అదీకాక ముందు రాబోయే ఆపదలు, మనస్సుకు ఛాయా మాత్రంగా గోచరంఅవుతయి అంటారు. అదేమో— చెప్పలేము. కాని సుందరం మనస్సు నరకం అయిపోయింది. ఎప్పుడూ అతడుఊహించని భావాలులేచి అతని మనోరంగంపై భయంకర నృత్యం చేసినవి.

* * *

ఒకసారి ఆ అమ్మాయి సినిమాకు వెళ్ళింది. పక్క ఇంటి ఆవిడతో కలిసి.

మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు ఆవిడతోరాక, వెనకబడి ఒంటిరిగా ఆలస్యంగా వచ్చింది. ఆమెతో కలిసి రాలేను. అదేమి అంటే, కారణం చెప్పింది.

* * *

సుందరానికిఇంకోవిషయంగూడా జ్ఞాపకానికివచ్చింది. తాను సాయంత్రం ఆరుగంటలకు కాని ఏడు గంటలకు కాని ఇంటికి వచ్చేసరికి, ఆపిల్ల వీధిగుమ్మంలోనే నిలబడి ఉండేది.

తన కోసమే నిరీక్షిస్తూ నిలబడ్డదని అనుకొన్నాడు. ఆ విష యం ఇప్పుడు ఆలోచించుకొంటే, అతనికి ఇంకోవిధంగా అర్థం అవుతున్నది.

*　　　*　　　*

"నేను ప్రొద్దున పదిగంటలకు ఆఫీసుకు పోతాను. సాయంత్రం ఆరింటికో ఏడింటికో వస్తాను. ఈ మధ్య కాలంలో అది ఏం చేస్తూకూర్చున్నదో ఎవరికి తెలుసు?" అనుకొన్నాడు.

సుందరం ఒకసారి ఆ పిల్లతో అన్నాడు, తన తల్లిని తీసుకొని వస్తాను-అని, అప్పుడు ఆ పిల్ల మాత్రం ఇష్టం కన పరచలేదు. మెదలకుండా ఊరుకొంది—దానికి ఇష్టంలేదు! ఇంత ఆలోచన కడుపులో పెట్టుకొని ఊరుకొంది!—లేక పోతే ఎందుకు అనదు, తప్పక తీసుకొనిరండి అని! ఆవిడవస్తే వంటకూడా ఆవిడే చేస్తుందాయె! తన కేమీ పని ఉండదు. హాయిగా కూర్చోవచ్చు. అయినా నోరువిప్పి "సరే" అన లేదు.

ఎక్కడికైనా, బైటికి వెళ్ళే సమయంలో ఎంతో అలంకారం చేస్తుంది. స్నో రాస్తుంది, పౌడరు వేస్తుంది, పూలు పెడుతుంది, కొత్తచీర కడుతుంది.

ఇంకా ఇంకా తమాషాలు చేస్తుంది. ఇంట్లో ఉన్న ప్పుడు చెయ్యదేం? తన కళ్ళముందు ఏమన్నా దరిద్రంగా చినిగిపోయిన బట్టకట్టుకొని కనపడుతుంది! ప్రపంచానికి, అందంగా అలంకరించుకొని కనపడుతుంది!

ఇన్నాళ్ళబట్టి సుందరం ఈ విషయాలేవీ ఆలోచించ లేదు. మైకం కమ్మినట్లు ప్రవర్తించాడు.

ఆ నిశీథాన, ఒంటరిగా నడుస్తూ ఉంటే ఈ విషయా లన్నీ తోచినవి, చెప్పకూడదు కాని అతనికి చాలా దరిద్రపు ఆలోచనలు వచ్చినాయి.

ప్రొద్దున తాను బయలు దేరినపుడు ఆ అమ్మాయి వీధిగుమ్మందాకావచ్చి, "ఏమండీ! రాత్రిబండికి ఇంటికి వస్తారా?" అని అడిగింది.

ఎందుకు అడిగింది అంత ఆదుర్దాగా? సుందరం ఈవిష యమైకూడా తీవ్రంగా ఆలోచించాడు.

"తొందరలో పనిపూర్తిచేసుకొని సాయింత్రం బండికి రండి"—అన్నది నవ్వుతూ!

నేను "రాను" అని చెప్పినా ఎందు కల్లాగ అన్నది,

రాత్రి బండికి తాను రావటానికి ఏమాత్రమైనా అవ కాశం ఉందో లేదో తెలిసికొంటానికేగా! దీని కడుపు బంగారంగానూ, ఎన్ని ఎన్ని ఆలోచనలు ఉన్నవి! అని అనుకొని సుందరం గబగబా ఇంటికి నడిచి పోయినాడు.

౨

ఇంట్లో దీపంలేదు. తలుపులు అన్నీ వేసిఉన్నవి. దీపం ఆర్పి పడుకుంటానికి కారణం ఏమైయుంటుందో అతనుఊహిం

చలేక పోయినాడు. ఈ విషయం అతని అనుమానాన్ని బాగా బలపరిచింది.

ఒక్క నిమిషం ఇంటిముందు నుంచుని ఆలోచించాడు. "ఏదో, ఈ సంగతి ఇవ్వాళ తేలిపోవాలె" అని నిశ్చయించుకొన్నాడు.

ముందు దొడ్డివైపుకువెళ్ళి అటు తలుపుకు బైటగొళ్ళెం పెట్టాడు. లోపలున్న మనిషి బయటికి పోవాలంటే ఇక మార్గంలేదు. వీధివాకిట్లో తాను ఉండనే ఉండె!

ఆ తరువాత కిటికీలోనుంచి తొంగి చూశాడు. కాని ఏమీా కనుపించలేదు. పడకగది తలుపుకూడా ఓరవాకిలిగా వేసిఉంది.

గదిలో పడుకొని ఉంటుంది ఆ పిల్ల, వీధితలుపుకొడితే తలుపు తీయాలిగదా. ఏదైనాదుష్ప్రవర్తనలోఉన్నట్టయితే పట్టుబడుతుంది.

వీధి తలుపు కొట్టాడు.

"జానకీ జానకీ!" అని గట్టిగా పిలిచాడు. ఎవరూ పలక లేదు.

లోపల ఎవరో లేచి తిరుగుతున్నట్లు అనుమానం కలిగింది సుందరానికి. దొడ్డి గుమ్మంవైపు ఎవరో ఇద్దరు మనుష్యులు నడుస్తున్నారు అనుకొన్నాడు. ఏం లాభం—ఆ వైపు ద్వారానికి బయట గొళ్ళెం పెట్టాడుగా!

సుందరానికి కాస్త నవ్వు వచ్చింది. విజయ సూచక మైన నవ్వు అది. కాని లోపల అసూయ అతని హృదయాన్ని దహించి వేస్తున్నది.

తన భార్య ప్రీతివాక్యాలతో తనను ప్రేమిస్తున్నట్లు భ్రమపెట్టి మోసగించింది. "దీనిని ఏం జేసినా పాపంలేదు-" అనుకొన్నాడు.

పాపం అతని గుండెలు దడ దడ కొట్టుకొన్నాయి. తన భార్య అటువంటి మనిషా ఇంతకూ!

మళ్ళీ తలుపుకొట్టాడు—జవాబు లేదు.

ఇంకా గట్టిగా కొట్టాడు—ఏమీ జవాబు లేదు.

ఎంత మొద్దు నిద్రఅయినా ఇంకా మెలకువ రాకుండా ఉండటం అసంభవం.

సుందరం ఒక్కక్షణం ఆలోచించాడు. ఆఅమ్మాయికి మెలకువ వచ్చే ఉంటుంది.

కాని తలుపు ఎట్లా తీస్తుంది, తన దుర్మార్గం బైట పడుతుందాయె! అందుకని ఏమీ తోచక ఊరుకొని ఉంటుంది అనుకొన్నాడు.

తలుపు కొట్టి కొట్టి విసిగి, నేను ఇంట్లో లేననీ, బాబాయిగారి ఇంటికో, లేకపోతే ఏ స్నేహితురాలు ఇంటికో వెళ్ళి పడుకొన్నాననీ, అనుకొంటాడు, నాకోసం వెతకటానికి వెడతాడు, అప్పుడు ఏదో ఉపాయంచేసి నా దుర్మార్గాన్ని

కప్పిపుచ్చుకోవచ్చును—అని ఆ పిల్ల ఊహించి, పలకటం లేదని సుందరానికి తోచింది.

ఇల్లాగ తోచటంలో విపరీతం ఏమీ లేదు సుందరం చాలా తెలివైనవాడు. బి. ఏ. ప్యాసు అయినా డు. తాలూకా గుమస్తా చేస్తున్నాడు. ఇటువంటి విషయాలలో అతనిబుద్ధి చాలా చురుగ్గా పనిచేస్తుంది-ఎందుకంటే, అతను కవిత్వంకూడా వ్రాసే మనిషి!

అయినా మళ్ళీ తలుపు కొట్టి గట్టిగా పిలిచాడు. ఎవ్వరూ పలక లేదు.

దుర్మార్గం చేస్తున్న మనిషి కాబట్టే పలకటానికినోరు రావటంలేదని అతనికి గట్టినమ్మకమే! అయినా వాళ్ళ బాబాయిగారి యింటికి వెళ్ళి చూచి ఆ అనుమానంకూడా తీర్చుకోనటం మంచిదని అతనికి తోచింది.

వెంటనే దొడ్లోకి వెళ్ళి, ఆ తలుపుకు బైట గొళ్ళెం పెట్టి ఉన్నట్లు మరొకసారి చూచుకొని, వీధిగుమ్మానికి కూడా బైట గొళ్ళెం పెట్టి బయలుదేరాడు.

పక్క వీధిలోకివెళ్ళి, తన పిన్నత్తగారిని లేపి "ఏమండీ, మీ అమ్మాయి ఉందా?" అని అడిగాడు.

"అదేమిటి నాయనా! ఎక్కడి కెళ్ళింది జానకి? మా యింటికి రాలేదే? నువ్వు ఎక్కడికి వెళ్ళావు?—" అని ప్రశ్నపైన ప్రశ్న అడిగారు.

సుందరం క్లుప్తంగా జవాబులు చెప్పి "నేను ఈ రాత్రికి రాను అనుకొని ఎవరింట్లోనైనా పడుకుందేమో తెండి ఒకర్తె ఇంట్లో పడుకోలేక!" అని చెప్పి "ఈ రాత్రికి నీవు ఇక్కడ పడుకో అబ్బాయ్" అని అన్నమాట వినిపించుకోకుండా గబగబా నడిచి తిరిగి ఇంటికి వెళ్ళి పోయినాడు.

ఆమె వెళ్ళి భర్తను లేపి చెప్పింది; ముసలాయన లేచి, "ఆ ఇంట్లోనే పడుకొని ఉంటుందే పిల్ల! అన్నాడు.

అయ్యో కాస్త వెళ్ళి చూచిరండి సంగతి ఏమిటో! ఇంట్లో ఉంటే ఎన్నిసార్లు పిలిచినా ఎందుకు పలకదూ?" — అన్నది.

ముసలాయన ఒక చేత్తో కర్ర, మరొక చేత్తో లాంతరు పుచ్చుకొని బయలుదేరాడు. దారిలో లక్ష్మయ్య, తిరువెంగళం కనపడి "ఏమయ్యా, ఈ అర్ధరాత్రి వేళ యాడికో ఎళ్ళు తున్నావూ?" అని అడిగారు.

"మా జానకమ్మగారి ఇంటికి. అల్లుడు అర్ధరాత్రి బండికి వచ్చాడు. పిల్ల లోపల నిద్రపోతూ ఉన్నదో ఏమో ఎన్ని పిలిచినా పలకలేదని వచ్చి చెప్పాడు. సంగతేమిటో చూద్దామని వెడుతున్నా" నన్నాడు.

ఆ వూళ్ళో సుందరాన్ని జానకమ్మను ఎరుగని వారు లేరు.

లక్ష్మమ్మ, తిరువెంగళం, దారిలో కనపడ్డ వాళ్ళతో ఈ సంగతి చెప్పారు కామాలు, పదినిమిషాలలో, ఒక ఇరవై లాంతర్లు బయలుదేరినై-సుందరం ఇంటి వైపుకు.

ఈలోపున సుందరం, తన ఇంటిముందు అరుగుపైన కూర్చుని ఆలోచిస్తున్నాడు.

అతడు పిన్నత్తగారింటికి వెళ్ళటం చాలా తెలివి తక్కువపని. జానకి పడుకొంటానికి ఎవరింటికైనా వెళ్ళి ఉన్నట్లయితే, బైట తాళంవేసి వెళ్ళుతుంది. వీధివైపుగాని దొడ్డివైపునగాని బైటతాళం వేసిలేదు. పైగా లోపల గడియపడి ఉందే! అల్లాంటప్పుడు ఆమె ఎక్కడికైనా వెళ్ళి ఉంది అనుకోటం వట్టి తెలివి తక్కువపనిగాక మరేమిటి!

తనుచేసిన తెలివితక్కువ పనివలన ఊళ్ళో వాళ్ళంతా లేచి వస్తున్నారు.

ఛా-ఛా--ఎంత అల్లరి అయిపోయింది! జానకి దుర్ప్రవర్తన బయటపడ్డా ఫలాని అబ్బాయి భార్య అని చెప్పుకొంటారు గదా ఊరంతా!

సుందరం తాను చేసింది వెధవపని అని తెలుసుకొన్నాడు. విచార పడ్డాడు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఇప్పుడేం చేస్తాడు! ఆ వచ్చిన వాళ్ళ అందరికి ఏం చెపుతాడు? ఈ దరిద్రపు అవస్థలోనుంచి బైట పడడం ఎల్లాగ?

జానకమ్మ తలుపుతీస్తే, వీళ్ళందరినీ వెళ్ళండి అన వచ్చు అందుకని తలుపు గట్టిగా కొట్టి "జానకీ—తలుపు తియ్యి. మీ బాబాయి వాళ్ళు అంతా వస్తున్నారు. చప్పునతీయి, అల్లరి పడిపోతాము,' అని కేకవేశాడు.

లోపలనుంచి జబాబు రాలేదు. వాళ్ళంతా వస్తున్నారు. సుందరానికి ఇక ఏం చేయుటానికి తోచలేదు. నిద్ర ముంచుకు పోతున్నది. అల్లరిపాలు అయినందుకు ఏడుపు కూడా వచ్చింది.

అంతా లాంతర్లు తీసుకు వచ్చారు. ఆ వచ్చిన వాళ్ళల్లో చాలా మందికి సంగతి ఏమిటో సరిగా తెలియదు.

జానకమ్మ తలుపు వేసుకొని లోపల పడుకుని, ఎంత పిలచినా పలకటం లేదని కొందరనుకొన్నారు.

"ఏమిటా ఎందుకు తీయదూ...?"

"ఏమోనమ్మా, మనకేం తెలుస్తుంది. వాళ్ళ ఇద్దరికీ ఏమున్నదొ్యా!"

"ఏమన్నా ఉండనీ—అర్ధరాత్రి వేళ మొగుడు ఇంటి కొస్తే, లోపల తింగు రంగా అని పడుకుంటుందా? ఇంత వైపరీత్యం ఎక్కడా చూడలేదమ్మా!"

"ఎందుకు తీయదురా!—ఛా అల్లాంటి మనిషి కాదు ఆ పిల్ల, ఏదో వేరే కారణం అయి ఉంటుంది!"

"ఏం కారణమోనమ్మా, నా నోటితో నేను అన లేను, మొన్న సత్తినిపల్లిలో అంతే అయిందిగా! రాత్రి బాగానే ఉంది తెల్లవారే సరికి బిగుసుకుపోయింది!"

"నారాయణ! నారాయణ! ఏంకర్మమో నమ్మా!"

"అంతే అయి ఉంటుంది లేకపోతే ఎంత పిలిచినా ఎందుకు పలకదు అత్తా?"

"ఏమో నాయినా! మనమేమి చెప్పలేము. ప్రొద్దున చూశాను నాయినా—బంగారు తల్లి లాగున్నది"

"అయిదో నెల కామాలు అత్తయ్యా?"

"అవును తల్లీ"

"కడుపుతో ఉన్నదానిని ఎట్లా వదిలేసి వెళ్ళాడమ్మా!"

"ఎక్కడికి వెళ్ళాడమ్మా, ప్రొద్దున గుంటూరు వెళ్ళి రాత్రికల్లా వచ్చేశాడు"

"ఎంతలోకి వచ్చింది!"

"అయితే, అత్తయ్యా వాతంవల్ల బిగుసుకుపోతారు. ఇది అంతే నంటావా?"

"శ్రీహరీ! ఎందుకు నాయనా మనం అనుకోటం"

"గర్భిణీ స్త్రీని బహు జాగ్రత్తగా కనిపెట్టి ఉండా లర్రా?"

"ఏదో నాయినా, అయిదోనెలే గదా అని అశ్రద్ధ చేశాడు సుందరం. అయినా పాపం ఏం కర్మమో!"

ఇల్లాగ తలోమాట అనుకొంటూ సుందరం స్నేహితులూ బంధుగులూ అంతా వచ్చారు

ముసలమ్మగారు వచ్చి, ఏడ్వటానికి సిద్ధంగాఉన్న సుందరాన్ని కౌగలించుకొని "ఏం నాయినా! దుఃఖపడబోకు, చూద్దాము అసలుసంగతి ఏమిటో, ఊరుకో నాయినా," అని ఓదార్చింది.

సుందరం మనసు ఏమీ బాగుండలేదు ఈ అప్రతిష్ఠ ఏమిట్రా బాబూ" అని అతడు అసలే దిగులుతో కూర్చున్నాడు. ముసలమ్మగారి మాటలు అతని మనస్సును ఏదో విధంగా మార్చినవి. ఆమెగారు కౌగలించుకొని ఏడిచేసరికి సుందరంకూడా జావ అయిపోయి బొట బొట కన్నీళ్ళు కార్చాడు.

ఇంకొక ఆవిడ అతని స్థితినిజూచి జాలిపడి అన్నది, "ఊరుకో నాయినా ఏంజేస్తాము. నీకు మటుకు ఏంతెలుసు ఇల్లా అవుతుందని"

సుందరానికి గుండె దడ దడ కొట్టుకున్నది. ఏదో జరిగిందన్న మాట! తనలో పిచ్చి ఆలోచనలు చేశాడు. జరిగిన సంగతి ఏదో భయంకరమైందన్నమాట!

వీళ్ళందరికీ ఏదో కొంత తెలిసినట్లుకూడా ఉంది! ఏమిటా కర్మం!

అతనికి కాళ్ళు గజ గజ వణికిపోయినాయి. ఆ అమ్మా యిని అనుమానించి, పాపిష్టి మాటలన్నీ అనుకున్నందుకు సుందరం ఇప్పుడు విచార పడ్డాడు.

తనభార్య గర్భిణీస్త్రీ అనికూడా ఇప్పుడతనికి చప్పున జ్ఞాపకం వచ్చింది. అట్టి స్థితిలోఉన్న బిడ్డనుగురించి దరిద్రపు విషయాలన్నీ ఆలోచించి నందుకు అతడు మరీ విచార పడ్డాడు.

పదిమందీ అనుకొన్న మాటలు సుందరం విన్న_త్తగారు కూడా విన్నది కాబోలు!

ఆవిడ పరుగెత్తుకుంటూవచ్చి సుందరండగ్గిర నిలబడి, "ఏం నాయనా! ఏమిటా సంగతి? లోపల పడుకొన్నది పడుకొన్నట్లే బిగుసుకు పోయిందటగా! ఇదేం కర్మం నాయినా?" అంటూ గోలు గోలున ఏడ్చింది.

సుందరానికి ఏమీ చెపటానికి తోచలేదు. అయినా అతని కేంతెలుసు?

తనకంటే వీళ్ళకే ఏదో తెలిసినట్లున్నది! లేకపోతే ఎందుకు అట్లా అట్లా అంటారు.

సుందరం అరుగు మీద చతికిల బడ్డాడు. అతని మనస్సుఅంతా గందరగోళంగా ఉంది.

జానకి లోపల పడుకొని, బిగుసుకు పోయిందా ?

పొద్దుటినుంచీ వాళ్ళంతా అను కొంటూనే ఉన్నారు కాబోలు ఇల్లాజరగవచ్చునని ! సుందరం బిక్కముఖం పెట్టి కళ్ళనీళ్ళు కార్చాడు.

ఈ లోపున నలుగురూ నాలుగు చేతులువేసి తలుపులు తేవనెత్తారు. లాంతర్లు తీసికొని లోపల ప్రవేశించారు. సుందరం పిన్నత్తగారూ, ముసలమ్మగారూ, లక్ష్మయ్య, తిరువెంగళం, హెడ్ గుమాస్తాగారూ, లెక్కల మాస్టారు, కోమటి పుల్లయ్య. రత్తమ్మ మహాలక్ష్మి, సాంబశివరావు, వెంకటేశ్వర్లు, నాగేశ్వరరావు మొదలైన విద్యార్థులూ,—

ఏడుకొండలు, పైడితల్లి మొదలైన కార్మికులూ, కోటిరెడ్డి, సీతారామ చౌదరి మొదలైన కర్షకులూ అంతా లోపలికి వచ్చారు.

ముసలమ్మగారు, "జానకీ ! జానకీ !" అంటూ పడకగదిలోకి పరుగెత్తింది. ఆమె వెంట ఆడవాళ్ళంతా వెళ్ళారు.

జానకమ్మ మంచంపైన పడుకొని ఉంది. తెల్లచీర కట్టుకొంది. జరీపేటగల నల్లనిరవిక తొడుక్కున్నది. తలలో పూలుపెట్టుకొని ఒత్తిగిలి పడుకొని ఉన్నది.

సుందరం అత్తగారు జానకమ్మ మీద చెయ్యివేసి, "అమ్మాయీ నాతల్లీ ఏమిటే నాతల్లీ!"—అని ఏడ్వటం సాగించింది.

ముసలమ్మగారు "ఒళ్ళు వెచ్చగా ఉందర్రా?" అని అడిగింది.

రత్తమ్మ కాళ్ళూ చేతులూ ముట్టుకొని చూచి, "ఇంకా వేడిగానే ఉన్నాయి?" అన్నది.

"డాక్టరును పిలవండ్రా" అని ఎవరో కేకలువేశారు.

ముసలాయనకు కాస్త నాడి చూడటం తెలుసు. ఆయన వచ్చి చెయ్యిచూచి "ఏమీలేదు, మీరంతా బైట కెళ్ళండి"? అని కేకవేశాడు.

సుందరంవచ్చి జానకి మీద చెయ్యివేసి— "జానకీ"- అని పిలిచాడు, ఆ అమ్మాయి, ఆ-అంటూ దిగ్గున లేచికూర్చుని "ఇదేమిటి!—వీళ్ళంతా ఎందుకొచ్చారు," అన్నది కళ్ళు నులుము కుంటూ, ముసలాయన "ఇక వెళ్ళండర్రా అనవసరంగా గోలఅయింది," అంటూ ఒక్కొక్కరినే బయటికి పంపివేశాడు. ఆత్మ బంధువులు తప్ప, తక్కిన వాళ్ళంతా, నవ్వుకొంటూ వెళ్ళిపోయినారు.

3

అందరూ వెళ్ళి పోయిన తరువాత ముసలాయన జాని కమ్మను అడిగాడు "ఇదేమిటే అమ్మాయ్ అల్లుడుఅన్ని సార్లు పిలిచి తలుపు కొట్టాడాయె! పక్క ఇంటి వాళ్ళు అంతా లేచారు, బయట అంతగోల అవుతూ ఉంటే నీకు నిద్ర మెల కువ ఎందుకు రాలేదూ అంట! ఇదేదో విచిత్రంగా ఉంది!"

"అట్లాగా బాబాయ్! నాకు ఏమీ తెలియదే!"

"ఏమిటే అమ్మాయి! నమ్మటానికి వీలులేకుండా ఉంటే!"

"నిజంగా బాబాయ్! గోల అయినట్లు తెలియదు నాకు, నేను సాక్షాత్తు వేంకటేశ్వర స్వామి సన్నిధిలో ఉన్నాను. !"

ఏమిటి తల్లీ అల్లా అంటావు.?

"కల బాబాయి; ఏమైందంటే నిన్న శుక్రవారంతలంటి పోసుకోవలసింది. ఏదో బద్ధకంగా ఉండి నిన్న పోసుకో లేదు.

ఇవ్వాళ తలకు నీళ్ళు పోసుకొని శనివారం కాబట్టి ఒంటి పూట భోజనం చేసి రాత్రి కాస్త ఫలహారం చేసి పడుకొన్నాను. పది గంటల బండికి ఒక వేళ ఆయన వస్తా

రేమోనని బెంగపడి వచ్చిన తరువాత చాలాసేపు వరకు చూస్తూ కూర్చున్నాను.''

''ఎందుకు కూర్చున్నావమ్మా? ఆయన రానని గట్టిగా చెప్పి వెళ్ళాడుటగా.''

జానికమ్మ ఈ మాటవిని ముసి ముసి నవ్వులు నవ్వు కొని, ''నాకు తెలును బాబాయ్! ఆయన ఇల్లు విడిచి ఒక్కపూట అయినా ఉండరు. ఏ రాత్రికైనా ఇంటికి వస్తారు. అందుకని చాలాసేపు కూర్చున్నాను, దాని తరువాత నిద్ర ఆపుకోలేక వెళ్ళి పడుకొన్నాను; మంచి నిద్రపట్టింది. ఆ నిద్రలో ఒక కల వచ్చింది—''

''ఏం కల అమ్మా?''

''చాలా తమాషాఅయిన కల—

''నేనుట, ఒక పెద్ద దేవాలయంలోకి వెళ్ళానుట. పెద్దగుడి, గోపురాలూ అన్నీ కనపడ్డవి. ఆ గోపుర శిఖరాలు బంగారపు పోత పోసినవి; ధగ ధగ మెరిసిపోతున్నాయి, దేవాలయం నిండా జనం కిట కిట లాడుతున్నారు. ఎట్లాగో కష్టం మీద గర్భగుడి దగ్గరకు వెళ్ళాను.

''అక్కడ కొంతమంది ద్వార పాలకులు జనాన్ని ఆపేసి, నలుగురు, నలుగురిని లోపలికి పంపుతున్నారు.

ఎంతో సేపు ఉంటేనే కాని నాకు స్వామి వారి దర్శనం అయ్యే లాగున లేదు. దిగులుపడి నుంచున్నాను.

"ఇంతలో ఆ అర్చకులలో ఒకాయన నా దగ్గరకు వచ్చి "అమ్మాయ్, నీవు ఇప్పుడు లోపలికి ఎల్లాగ వెడతా వమ్మా? ఇంకా ఒక గంటసేపు ఉంటే నీకు స్వామి దర్శనం చేయిస్తాను తల్లీ! అంతవరకూ నీవు ఈ పూలు మాలలుగా గుచ్చు అమ్మా, స్వామికి పవళింపు సేవ సమయంలో కావాలి" అన్నాడు.

"ఆయన లావుగా ఉన్నాడు గండభేరుండంచువస్త్రాలు ధరించాడు, పెద్ద వెడల్పు అయిన పట్టె వర్ధనాలు పెట్టు కొన్నాడు. ఆయన నా ముందు బుట్టెడు పూలూ, కొన్ని అరటినార దారాలు పెట్టి నవ్వుతూ, "మాలలు కడదాంరా అమ్మా!" అని నాకు ఎదురుగా కూర్చున్నాడు.

"నేను పూలు దండలు దండలుగా గుచ్చి వేశాను, భక్తులు "గోవిందా, ఏడుకొండలవాడా! స్వామీ, జగద్రక్షకా!" అంటూ, ఆవేశంతో కేక లేస్తున్నారు.

"నా వళ్ళు పులకరెత్తింది బాబాయి!

"ఇంతలో దూరాన్నుంచి పిలుస్తున్నట్లు తోచింది.

"మీ అల్లుడే ఎక్కడినుంచో పిలుస్తారట! తలుపు కొట్టిన శబ్దంకూడా ఏదో తమాషాగా వినబడుతుంది. వెళ్ళా లనుకొంటానుట! మళ్ళీ ఈ భక్తుల అరుపులవలన నాలో సంతోషం పొంగిపోయి ఆ విషయము మరిచిపోతానుట.

"మళ్ళీ అయ్యో! స్వామికి పుష్పమాలలు గుచ్చ కుండా ఎల్లా వెళ్ళేదా" అని అనుకొంటానుట. ఇట్లా అని పించింది.

"దబ్బున కానీ అమ్మా, స్వామి పవళింపు సేవకు సమయం కావస్తున్నది" అని నా ప్రక్కనున్న స్వామి నన్ను తొందర పెడతాడట.

"ఆ తరువాత నాకు ఏమీ తెలియ లేదు. ఆయన, స్వామి దర్శనం చేదువుగాని స్వామికి నిద్రవేళ అయింది; లే, అమ్మా అని పిలిచాడు నేను 'ఆఁ' అంటూ లేచాను, నేను లేచి చూచేసరికి ఈ స్వామి కనపడ్డారు"

ఇల్లా చెప్పి, కలలో స్వామి దర్శనం కాలేదు బాబాయ్ ?" అని జానకమ్మ జాలిగా చూచింది.

ముసలాయన, ఆయన భార్యకూడా జానకమ్మను కౌగలించుకొన్నారు.

"నా తల్లి ! నా తల్లి ! ఎంత మంచి కలగన్నావమ్మా, నీకు మగపిల్లవాడు పుడతాడే నా తల్లి ! వెంకటేశ్వర్లు పేరు పెట్టుకో, అన్నది ముసలమ్మగారు. అప్పుడే పసుపుగుడ్డలో ఒక రూపాయి ముడుపు గట్టారు. జానకమ్మ, ముసలమ్మ, రత్తమ్మ, ముసలాయన మొదలైన ఆప్తబంధువులు అంతా కూడా, దేముడి గదిలోకి పోయినారు. స్వామి వారి ఎదుట నిలబడి నమస్కారించారు. జానకమ్మను కలలోకనుపించాడు. ఆ అమ్మాయి భక్తురాలు అల్లాంటి బిడ్డను గురించి తెలివి తక్కువ ప్రసంగాలు చేసినందుకు వాళ్ళు అంతా పశ్చాత్తాపంతో చెంపలు వేసుకొన్నారు.

జానకమ్మ, సుందరం, ముడుపుగట్టిన గుడ్డ స్వామి పాదాలవద్ద ఉంచి, కళ్ళుమూసుకొని ధ్యానంచేసి, మనస్సులో మొక్కుకొన్నారు. దాని తరువాత "మీా రేమను కొన్నారు—మీా రేమనుకొన్నా"రని భార్యా భర్తలు మాట్లాడుకోవటంలో తేలిన విషయాలు ఇవి—

"స్వామీా, నేను, ఆయనకూడా, నీ వరప్రసాద లబ్ధుడైన కొడుకును ఎత్తుకొని కొండ ఎక్కుతాము తండ్రీ" అని

"స్వామీా, ఏడుకొండలవాడా, రక్షించు స్వామీా, నేనూ మా జానకీ, కొడుకును ఎత్తుకొని కొంగూ, కొంగూ

ముడేసుకొని కొండెక్కుతాము" అని మొక్కుకున్నాడు సుందరం.

తాను జానకినిగూర్చి పాపిష్టి ఆలోచనలు చేసినందు లకు మనః పూర్వకంగా విచారపడి "స్వామీ అపరాధం జరిగింది క్షమించు" ఆ పాపం పోవటానికి, ప్రాయశ్చిత్త పూర్వకంగా కొండపైన కేశ ఖండన చేయించుకొంటానని కూడా సుందరం మొక్కుకొన్నాడు.

---

# ఇంటర్వ్యూ

ఏడుపు ముఖంతో మళ్ళీ వచ్చాడు నాదగ్గరకు మా రంగడు. "ఏం రా ఎక్కడన్నా ?" అని అడిగాను.

వాడు బిక్క మొఖంతో లేదన్నట్లు తలతిప్పుతూ పెదవి విరిచి, "ఎచ్చే ఎక్కడా దొరక లేదు" అన్నాడు. నిరాశతో కళ్ళనీళ్ళు పెట్టుకున్నట్టు కూడా అనుమానం వేసింది.

మా వాడ్ని పిలిచి దగ్గరకూర్చోపెట్టుకొని కాఫీ తెప్పించి ఇచ్చాను. పది నిమిషాలు గడిచింది. వాడే అన్నాడు. "ఏం బావా, మరి ఏం చేసేది ఇహా ?" అని.

వాడిని చూస్తే నాకు జాలి వేసింది. ఇప్పటికి నెల నుంచి ప్రయత్నం చేస్తున్నాడు ఉద్యోగం కోసం. ఎక్కడా లాభించలేదు.

రంగడు బి ఏ. ప్యాసు అయినాడు. బుద్ధిమంతుడు. వట్టి అమాయకుడు. వినయ విధేయతలకు, వాడ్ని చెప్పి ఇంకొర్ని చెప్పాలి. అయితే ఏం, ఎక్కడా దొరక లేదు ఉద్యోగం. మళ్ళీ ఈసారి కూడా ప్రయత్నంవ్యర్థం అయింది అనేసరికి నాకూ చాలాకష్టం వేసింది, ఎందుకంటే నేను ఈ

తప్పా వాడికి ఒక మంచి ఉపాయంచెప్పి పంపాను. ఇంతకు వాడు నేను చెప్పినట్లు చేశాడో లేదో ! చేసే ఉంటాడు. అయినా కనుక్కుందా మని అడిగాను. ఏంరా, అయితే నేను చెప్పినట్లు చేశావా ?

"ఆ అక్షరాలా నీవు చెప్పినట్లుగా చేశాను."

"ఏం చేశావు చెప్పూ. ఎక్కడో లోపం జరిగి ఉంటుంది."

"ఏమీ లోపం జరగలేదు. చెపుతాను విను.

వెళ్ళాను..."

"ఇంటికేనా ?"

"ఆ, ఇంటికే వెళ్ళి..."

"చీటీ పంపావా ?"

"అక్కర లేకపోయింది." ఆయన బైట వరాండా లోనే కూర్చుంటే, నేను వెళ్ళి కనబడి నమస్కారంచేశాను.

సరే. ఫరవా లేదు. తరువాత ?"

ఆయన ఊరికనే ఉన్నాడు. సిగరెట్టు తాగుతూ చాలా సరదాగా ఉన్నాడు."

"మంచి సమయంలోనే వెళ్ళా వన్నమాట !"

"ఆయన కూర్చోండి అని కుర్చీ చూపించి ఎందుకు వచ్చావు అన్నట్లు చూశాడు."

"చెప్పేశావా, ఉద్యోగానికని ?"

"ఎందుకు చెపుతాను నీవు వద్దు అన్నావుగా ?"

"సరే, ఏమన్నావూ ?"

"నేను మీశాఖవాడినే అండి మీరు మనశాఖీయులు గదా అని ఒక్కసారి తమదర్శనం చేసుకొని వెడదామని వచ్చాను అన్నాను."

"బాగుంది. సరియైన దారినే నడిచావుకదా. అంతే?

ఆయన చాలా సంతోషించి మన శాఖీయులలో కొందరి పేర్లు అడిగాడు !

"అక్కడే పాచిక వేశావా ?"

"వెయ్యక మానా ? ఆయన అడిగిన వాళ్ళంతా నాకు మేనత్త కొడుకులైనట్లు మాట్లాడాను"

"నేను చెప్పలేదురా ! అదే మార్గంరా, ఆయన సంతోషించి ఉండాలె, ఏం ?",

"సంతోషించకేం? సంతోషించి, మనం అంతా బంధువులం అన్నమాట! మీరు రావడం బాగుంది. అంటూ కాఫీ కూడా ఇచ్చాడు."

ఇదంతా విని నేను విరగబడినవ్వాను. ఎట్లాగయినా శాఖాభిమానం పోదు ఎంత చదువుకొన్నా! మావాడు నేను చెప్పిన పద్ధతిని చక్కగా అమలులో పెట్టినందుకు కూడా సంతోషించాను. అప్పుడు అడిగాను వాణ్ని "తరువాత సంగతి చెప్పవేం?" అని! వాడు చెప్పాడు. "కాఫీ అయిన తరువాత ఇది మీ స్వగృహమే కండడీ!" అని అడిగాను.

"ఓరి! అసాధ్యుడవే! నీకు ఆ సంగతి తెలియనట్లు?"

"ఆ"

"అవునుగాని అపళంగా ఆ ఇల్లు బాగుందని మెచ్చుకోకపోయినావ్?".

"మెచ్చుకోకుండా ఊరకుంటానా! లక్షుగా మెచ్చుకొన్నాను."

"ఏమన్నావూ? ఏమిటి! చెప్పూ"?

"ఇల్లుమటుకు కుదిమట్టంగా చాలా బాగుందండీ" అన్నాను.

"ఆ వెధవకొంపను పట్టుకొని!" అని నేను నవ్వాను

"అది ఎల్లాంటి కొంప అయితేనేం! నేను అనాలిసిన రీతిని నేను అన్నాను మాంచి గాలి వస్తుందండి ఊరిబైట అయితే మాటుకు ఏంకాని" అని.

నేను వాడి మాటకు అడ్డువచ్చి ఆ మాట ఎందుకు అన్నావురా? అన్నాను.

"అంటే ఏంలే! ఇట్లా అన్నాను. అసలు ఏమాత్రం జ్ఞానం ఉన్నవాడైనా ఇట్లాంటిప్రదేశంలోనే ఇల్లుకట్టుకుంటూడండి పట్నంలోమురికికూపం" ఆయన నేనుఅన్నదిఅంకురాలా నిజం అన్నట్లు తల ఊపి పైగా అన్నాడు నవ్వుతూ. "ఈబందరు చూశారూ ఇది నరకంలోఒకభాగం" నేను అన్నాను. "అల్లాకాదండీ, నరకమే బందరులో ఒకభాగం అండీ" అని.

చాలా బాగాఅన్నావు అని నేను తల ఊపాను.

"ఈ చమత్కృతికి ఆయనచాలాసంతోషించి విరగబడి నవ్వాడు. దాని తరువాత నేనే అన్నాను, ఈ గాలితిని బ్రతకొచ్చునండీ" అని.

మా వాడు బాగానే అన్నాడు. నిజం మాట అంతే, అక్కడ కూరగాయలూ అవీ ఏమీ దొరకవు, ఒక్క గాలే

దాంతకుతుంది. నేను నవ్వుకొని "ఇంకా ఏమన్నావు?" అని అడిగాను.

"ఇల్లు గాలివాటంలో ఉందనీ, కట్టటం మహాబాగుందనీ, కిటికీలూ అవీ, పెద్దదయ్యాల లాగ కాక అంచక్కా కుదిమట్టంగా ఉన్నాయనీ, గదులు విశాలంగా లేకపోయినా ముద్దొస్తున్నాయనీ, ఇల్లు ఇనపపెట్టెలాగ ఘట్టిగా ఉందనీ నట్టింట్లో బంగారం పారేసుకొన్నా ఎక్కడికిపోదనీ, మొత్తం మీద ఇంట్లోలక్ష్మి తాండవమాడుతున్నదనీ, ఒక్కటొక్కటిలో అనేశాను.

"రైట్! ఇక నీకు ఉద్యోగం వచ్చితీరుతుంది ఇవ్వాళ కాకపోతే రేపైనా ఉద్యోగం సంపాదించటానికిగాని, సంపాదించిన ఉద్యోగాన్ని నిలబెట్టుకొంటానికి కాని, ముఖ్యంగా కావలసింది ఇట్టాంటి మనస్తత్వం" అన్నాను నేను మా వాడితో.

ఆలోచిస్తే మావాడు లాచా తెలివైన ఘటంలాగ కనబడుతున్నాడు. మనిషినికాస్త పొగడటం మంచిది. దాని వల్ల మనిషి మనకు సుముఖుడు అవుతాడు అన్నాను. అంతే, అంతకంటే నేను ఎక్కువగా చెప్పిందీలేదు. ఇదైనా స్వంత తెలివితేటలవల్ల ఊహించిందేమీ కాదు. డీన్ కాంర్నిజ్

అనే ఆయన పాటు ఇన్‌ఫ్లుయన్సుపీపులు అనే పుస్తకంలో ఈ రహస్యాన్ని బైటపెట్టాడు. ఈ విషయాన్ని మావాడికి నేను కాస్త అందిస్తే వాడు అల్లుకుపోయినాడు. ఏం పోక! తెలివి తక్కువవాడా ఏమన్నా?

అసలు రహస్యం ఏమిటీ అంటే ప్రతి వాడూకూడా తన ఇల్లు అందమైనదనీ సహజంగా అనుకొంటాడు. ఒకడు తనను గురించి ఏమనుకొంటాడో, ఆదేమాట మనం అంటే అంత పట్టివ్వడు. ముఖస్తుతీ అనిపించుకోడు. నగ్నమైన సత్యాన్ని చెప్పినట్లేతోస్తుంది నల్లగా ఉన్నాడనుకోండి ఒక ఆయన. "నా మొఖం తగలెయ్యా, కోతివిలాగ ఉంది నా మొఖం, ఈ మొఖం పెట్టుకొని తిరిగేకంటే చస్తే మేలు" అనుకోడు. నల్లగా ఉన్నమాట నిజమే. కాని అంతమాత్రం చేత నేనేమీ అంత పెద్ద అంద వికారినైపోలేదు. ఏదో సామాన్యపు మనిషిని" అనుకొంటాడు. కాబట్టి పొగడ్త అనేది, నిజం లాగున కనపడేటట్లుచేసి హోమియోపతిడోసు ఇస్తే తప్పకుండా మంచి సుగుణం ఇస్తుంది. ఇల్లాగ అను కొంటూ ఏదో ఆలోచనలో పడి మాట్లాడకుండా ఉండే సరికి మా వాడు "ఏమిటి బావా, ఆలోచిస్తున్నావు?" అన్నాడు "ఏం లేదులే దానితరువాత ఏం జరిగింది చెప్పూ!" అన్నాను.

"ఇల్లు బాగుందన్నా కామా. అందుకని ఆయన నన్ను లోపలికి తీసికెళ్ళి, ఇల్లంతా చూపెట్టాడు. అంత పెద్ద జీతగాడు కదా ఆయన, ఇల్లు అంత అసహ్యంగా ఉందేం? అంత దరిద్రపు కొంప నే నెక్కడా చూడలేదు పది సంవత్సరాల క్రితం గోడలకు సున్నంగొట్టి ఉంటారు జేసెడు, జేనెడు గదులు! ఇంటినిండా మాసిన బట్టలు, గోడలకు పగిలిపోయిన ఫోటోలు!

"అయితే నీ వేమన్నా తెలివితక్కువగా......"

"అహా హా హా! అంత తెలివితక్కువగా ఏమీ అన లేదు. ఆయనే అన్నాడు. "నేను ఎంత మొత్తుకొన్నా లాభం లేదండి. మా ఆవిడకు ఇల్లు శుభ్రంగా ఉంచాలన్న గొడవే తెలియదు. "అప్పుడు నే నన్నాను నవ్వుతూ, దాని కేంలెండి. పిల్లలుగల ఇల్లు ఎల్లాగుంటుంది మరి? ఎంత మంది నౌకర్లు ఉన్నా పిల్లలుగల ఇల్లు ఇంతేనండి! ఆయన సంతోషించి నాతో గర్వంగా అన్నాడూ, నేను ఆఫీసు ప్యూనును ఇంటికి రమ్మనను, వాళ్ళచేత పని చేయించుకోను, అని. ఆ మాట విని నేను, అంత విచిత్రమైనటువంటి పనిచేయుట కంటే మరొక ఘనకార్యం ఈ ప్రపంచంలో మరొకటి లేదు, అని అనుకొన్నట్లు చూశాను."

మావాడు చెప్పిన ఈ మాటలన్నీ విని నేను చాలా సంతోషించాను. నేను సూత్రప్రాయంగా చెప్పిన విషయా లన్నీ మావాడు చక్కగా ఆచరణలో పెట్టాడు. ఇల్లాంటి శిష్యులను ఇద్దరిని తయారుచేస్తే నేను లోకాన్ని కొంత బాగుచేసినట్లే! ఇల్లాగ అనుకొని వాడి వంక చూశాను. మిగిలిన విషయం చెప్పమన్నట్లు. వాడు ఇల్లాగ చెప్పాడు.

"ఇల్లంతా చూచి మేమిద్దరం బైటికివచ్చేశాంబావా! వాళ్ళ వాకిట్లో ఒక కుక్క కనపడ్డది. దాన్ని దగ్గరకు పిలి చాను. అదివచ్చి ముందు కాళ్ళు రెండూ ఎత్తినా మోకాళ్ళ మీద ఆనించింది. ఆ కుక్కను చూస్తే నాకు అసహ్యం వేసింది."

"అయినాఆకుక్కను నీవు మెచ్చుకొన్నావుకాదూ!" అని అడిగాను:

"తప్పుతుందామరి! మెచ్చుకొంటూన్నట్లు కనపడ కుండా మెచ్చుకొన్నాను. 'ఇది కరవరావటం లేదండీ! కొన్ని కుక్కలు కొత్తమనిషిని చూస్తే తెగ మొరుగుతై! అన్నాను. ఆయన ఇహ ఒక అరగంటసేపు ఆ కుక్క సుగుణాలను గురించి చెప్పాడు. దానికి పెద్దమనుష్యులు ఎవ్వరైంది తెలుసు నట. వాసనచూసే కనుక్కుంటుందట. ఇంతకూ అది నన్ను

జూచి అరవక పోవటం ఒక గొప్ప అదృష్టం. అది అరచి ఉన్నట్లయితే నన్ను దొంగక్రింద కట్టేశేవాడు ఆయన. ఆఫీసర్లకు తమ కుక్కల యొక్క, ప్యూనుల యొక్క శక్తి సామర్థ్యాలలోను సత్యసంధతలోనూ, ఉన్న గట్టి నమ్మకం భగవంతుడి యందు సహితం ఉండదు. ఆ కుక్క అరవక పోవటం మూలాన నేను బ్రతికిపోయినాను. ఆయన నన్ను మర్యాద చేశాడు. భోజనానికికూడా ఉండమంటాడు అను కొన్నాను గాని అనలేదు; "ఇంకోసారి రండి మాట్లాడు దాము; ఇప్పుడు కొంచెం పనిమీద వెళ్ళాలె" అని అంటూ నన్ను సాగనంపుతూ ఆయన వరండా మెట్లుదిగాడు. అప్పుడు, ఒక చిన్న పిల్ల ఆరేండ్లది, ఒక మాసినచొక్కా వేసుకొని, మెట్లెక్కు తున్నది. దాన్ని చూసేసరికి నీవు చెప్పినమాట జ్ఞాపకం వచ్చింది; పిల్లలనుకూడా మెచ్చుకో వలెననీ, తండ్రికి తన పిల్లలనుచూచి, ఇతరులు ఆనందించా లని ఉంటుందనీ నీవు చెప్పావు; అందుకని చప్పున ఆ పిల్లను ఎత్తుకొని బుగ్గగిల్లి ముద్దాడి, అంతకుముందే జాగ్రత్తపడి జేబులో వేసుకొని పోయిన పిప్పరమెంటు బిళ్ళలను రెండు చేతులలో పెట్టాను.

"రైట్—చాలా బాగా చేశావు; ఇంకా నీకు దిగులు వద్దు. అయితే ఆ పిల్లను ఎత్తుకొని ముద్దాడావుగదా,

అప్పుడే అనకపోయినావు పిల్ల అంచక్క ముద్దొస్తూఉండనో, ఏవో అల్లాంటిమాటలు !

అనక ఊరుకుంటానా బావా! పిల్లవంక జూచి నవ్వుతూ, అంతా మీ రూపేనండి; ముక్కు మీ ముక్కు ! నోరు మీ నోరు ! కళ్ళు మీ కళ్ళు ! నవ్వితే అంతా మీరు నవ్వినట్లేఉంది ! ఆడపిల్లలకు తండ్రి రూపు రావటం చాలా అదృష్టమండీ అనీ, తమ కెంతమందండీ సంతానం? అని అడిగేను. ఆయన లోపల విచారం పెట్టుకొని, పైకి నవ్వుతూ నాకు పిల్లలు లేరండీ ! అన్నాడు; ఇట్లా చెప్పి మావాడు విచారంగా చూశాడు.

నాకు చాలా కష్టంవేసింది; మావాడు అద్భుతమైన ప్రవర్తన అంతా వృధా అయిపోయింది; వృధా అయిపోవటమే కాకుండా ఎవరి పిల్లనో పట్టుకొని, వీడు అంతా మీ రూపేనండి అని అనటంలో, వాడు అబద్ధాలు ముఖప్రీతి మాటలూ, అంటున్నాడని తెలిపోయింది; ఇల్లా అనుకుంటూ చాలాసేపు విచారపడి చివరకు అన్నాను—పొరపాటు అయిపోయిందిసుమీ ! ఆ ఒక్కమాటా అనకుండా ఉండాలిసింది.

"ఎట్లాఅనకుండా ఉండేది బావా! ఆ పిల్ల నిజంగా ఆయన రూపు నే ఉన్నట్లు కనపడ్డది" అన్నాడు మావాడు

"దానికేంలే, మనము ఎల్లాగ అనుకొంటే అల్లాగ కనపడుతుంది. ఒక్కపని చేయాలిసింది ఆయనకు పిల్లలు ఉన్నదీ లేనిదీ నేవు ముందుగా విచారించవలసింది! సరేఏం జేస్తాము? ఆయన నాకు పిల్లలు లేరు అన్నప్పుడు నీ వేమన్నావూ?

"అంత పోలిక ఉండుట మూలాన, ఈ పిల్ల మీ తమ్ముడి కూతురా అండి, అని అడిగాను చప్పున!"

భేష్—అతికి పోయింది బ్రతికిపోయినావు. తమ్ముడి కూతురు ఆయన పోలికలో ఉండటం ఆశ్చర్యం లేదు. కాబట్టి. నీవు అబద్ధాలు ఆడుతున్నావని అనుకొంటానికి ఆయనకు అవకాశంలేదు—బాగా తోచిందిరా నీకూ.!"

అని మెచ్చుకొన్నాను.

మావాడు బిక్కముఖంపెట్టి మళ్ళీ అన్నాడు. "కాని ఆయన "అవును" అంటే బాగుండేది?"

"ఆఁ అనకా?"

'తెల్లముఖం వేశాడు!'

"చేసీ?"

"మా ఇంట్లో పనిచేసేదాని కూతురు ఆ పిల్ల! అన్నాడు!

నేను నిలువునా నీళ్ళై పోయినాను. ఏమీా తోచక తర్వాత సంగతి ఏమిటి అన్న అర్థంలో అ అ అః ! ! ! ! అన్నాను.

"ఇంకా అః ఏమిటి నా బొంద ! అః లేదూ ! ఊః లేదూ ! ఆపళంగా వచ్చేశాను" అని విసుక్కున్నాడు.

సమాప్తము.

